వారికి నానావాక్యార్థవిచారమువలన నిష్ప్రయోజన మంతయుఁ గేవలపరధనగ్రహణార్థమే.

పురు—తరువాత? తరువాత?

ఉప—తరువాత నేనొకచోట

మ. పరిపూర్ణాజ్యజుహూముఖ్యగాజినసమిద్బర్హిస్స్రువోపేత యై,
వరసోమేష్టిపశుప్రభృత్యురుమఖవ్రాతోల్లసత్పార్శ్వ యై,
నిరతప్రాకృతకర్మకాండబహుధాసిక్తిష్టమార్గాళి యై,
సరసం గ్రమ్మరుయజ్ఞవిద్యఁ బొడగాంచం గలిటి మార్గంబునన్.

పురు— అటుతరువాత?

ఉప—తరువాతఁ బుస్తకభారవాహిని యైనయామెకు సాతత్త్వ మేమయినఁ దెలిసి యుండునని యెంచి నేనామెసన్నిధిని గొన్నిదినములు గడపవలెనని తలఁచితిని.

పురు—తదనంతరము?

ఉప—తదనంతరము నేనామె సమీపమునకుఁ బోఁగా, “ఓసుమంగళీ! నీకోరిక యేమి?” అని యామె నన్నడిగెను. “అమ్మా! నేనిప్పు డనాథనయి యున్నదానను. కాఁబట్టి నీయొద్దనుండఁ గోరుచున్నాను.” అని నేను జెప్పితిని.

ఉప—అటుపిమ్మట?

ఉప—అటుపిమ్మట “ఓసుమంగళీ! నీవుచేయుపనియేమి?” అని యామె నన్నడిగెను.

పురు—అటువెనుక?

ఉప—అప్పుడు నేనిట్లంటిని—

చ. ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు, నీజగం
బెవ్వనికాంతిచే వెలుఁగు, నెవ్వనితేజము సత్సుఖోజ్జ్వలం,
బెవ్వనిఁగొల్చి ద్వైతతమ మీగఁ బునర్భవ మొందరెవ్వఁడున్
నెవ్వఁడిఁ బుణ్యు, లాపురుషు నిత్యుని శాంతు స్తుతింతు నక్రియున్.

అంతట యజ్ఞవిద్య యాలోచించి యిట్లనియెను—

“గీ. అక్రియుఁ డగువాఁ డీశ్వరుం డగుట యెట్లు?
సత్క్రియలు గాని వస్తువిచారబుద్ధి
యరయ భవబంధ నాశనకరము గాదు;
జనుఁడు భవనాశకరకర్మ లొనరఁ జేసి
వత్సరశతంబు శాంతుఁడై బ్రతుకఁగోరు.

కాఁబట్టి నే నిన్నుఁ జేకొనటవలనఁ బ్రయోజనము లేదని తలఁచెదను. అయిన ననీవు కర్తయు భోక్తయు నగుపురుషునిఁ బ్రస్తుతించుచుఁ గొంతకాలమ్ముచట వసింపఁ గోరెదుపక్షమున నాకాక్షేపమేమియు లేదు.''

వివే—ఆహా! ఏమి ధూమాంధకారశ్యామలితనయన యయిన యజ్ఞవిద్య యొక్క దుష్పరిజ్ఞత్వము! ఆమె యీప్రకారముగాఁ గుతర్కముచేతఁ జెడిపోయినది.

ఉత్సాహ. సహజముగ నచేతనంబు జడము నైన లోహ మి
ష్టహాని జుంబకోపలంబుముందటం జలించు న
ట్లహాహ! మాయయుం సృజించు నఖిలలోకములను ని
స్పృహాత్మ విశ్వసాక్షియైన యీశుదృష్టి ప్రేరణన్.

కాఁబట్టి తమోంధులయినవారిదృష్టి యీవిధముగానే యుండును. అజ్ఞానసంభవమయిన సంసారమును గర్మలచేత నశింపఁ జేయఁ గోరెడుయజ్ఞవిద్య నిశ్చయముగా గాంఢాంధకారమును సహిత మంధకారముచేతఁ బోఁగొట్టఁబూనును. ఎట్లన—

గీ. నశ్వరములు నజ్ఞానజన్యములు నైన
యేడులోకంబులఁ బ్రకాశ మెవఁడొసర్చు
నతనిఁ బొందును విబుధాళి మృతిని గెలిచి;
యితర మేటిలేదు భవముక్తిహేతుసరణి.

పురు—తరువాత? తరువాత?

ఉప—తరువాత యజ్ఞవిద్య మరల నాలోచించి, ఓసఖీ! నీవిచ్చట నుండుట వలన దుర్బుద్ధిగ్రస్తులనిలెనాశిష్యులు కర్మలయం దాదరము తగ్గినవారగుదురు. కాఁబట్టి, తల్లీ! నీవు నాయందనుగ్రహించి నీయిచ్చవచ్చిన దేశమునకు విజయం చేయుము.'' అనెను.

పురు—పిమ్మట?

ఉప—పిమ్మట నేనామెను విడిచి బయలుదేఱితిని.

పురు—అటుతరువాతి?

ఉప—తరువాత కర్మకాండసహచరి యైనమీమాంస నాకుఁ గనఁబడినది. ఆమీమాంస—

చ. కర మధికారయోగ్యముగఁ గర్మముల న్విభజించి మించి, సు
స్థిరఘనగౌరవంబున శ్రుతిప్రముఖప్రబలప్రమాణముల్
పరుసను వెంటనంటి కొలువన్, సువిచిత్రతరాంగయుక్తయై,
పరఁగెఁ, గృతోపదేశమయి భాసిలునయ్యతిదేశరాజితోన్.

పురు—అనంతరము.

ఉప—అనంతరము నేనామెను సహితము పూర్వమువలెనే యాశ్రయమును వేఁడితిని. అప్పుడామెయు "ఓసుమంగళీ! నీవుచేయుపనియేమి?" అని నన్నడిగెను. అంతట నేను దొంటివలెనే "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు", మొదలు గాఁగల వాక్యమును జెప్పితిని.

పురు—ఆవల?

ఉప—ఆవల మీమాంస పార్శ్వవర్తులముఖమును జూచి "లోకాంతరఫలోప భోగయోగ్యుఁడైన పురుషుని బ్రతిపాదించుటచేత మన కీమెవలన బ్రయోజనముగలదు. కాఁబట్టి కర్మోపయుక్తయైన యీమెను స్వీకరింపుఁడు." అని పలికెను. అక్కడ వారిలో నొకశిష్యుఁడు దాని కనుమోదించెను. ప్రసిద్ధప్రతిష్ఠుఁడైన కుమారిలస్వామి యను మఱియొకఁడు మీమాంసాహృదయాధిదేవతయో యనునట్లుగా "దేవీ! ఈమె కర్మోపయుక్తుఁడయిన పురుషునిఁ బ్రతిపాదింపదు; కర్తయు భోక్తయుఁ గానియీశ్వ రునిఁ బ్రతిపాదించును. ఈమె కర్మలకించుకయు నుపయోగపడునదికాదు.' అనెను. అప్పుడింకొకఁడు "లౌకికపురుషునికంటె నన్యుఁడయి యీశ్వరుఁడని యొకఁడున్నాఁ డా?" అని యడిగెను. అంత నతఁడునవ్వి "ఉన్నాఁడు" అని మరల నిట్లనియెను:—

చ. ఒకఁడు కనున్ జగత్క్రియల, నొక్కఁడు మోహయుతాంధబుద్ధియౌ
నొకఁ డిడుఁ గర్మజాలఫల, మొక్కఁడు తత్ఫలవాంఛఁ జేయుఁ; దా
నొకఁడు శరీర మ్మడుపు, నొక్కఁడు కర్మములన్నియుక్తుఁడౌ;
నీకను విసుగుఁడౌపరము నెట్లుగుఁ జెప్పఁగఁ గర్మభోక్తఁగన్?

వివే—(హర్షముతో) మేలు! కుమారిలస్వామీ! మేలు! నీవు మంచిప్రజ్ఞగలవాడవు. నీవు దీర్ఘాయుష్మంతుఁడవుకమ్ము.

క. సహవాసులుఁ జెలులును నౌ
విహగంబులు రెండు నేకవృక్షమె చేరున్;
విహగ మొకటి తిను ఫలముల;
నహహా! రెండవది తినక యాలోకించున్.

పురు—తరువాత?

ఉప—తరువాత నేను మీమాంసవద్ద సెలవుగైకొని వెడలితిని.

పురు—అటుతరువాత?

ఉప—అటుతరువాత నేను శిష్యులు పలువుండ్రచేత నుపాస్యమనమైన తర విద్యలను బొడగాంచితిని. అందు,

మ. తెలుపు న్విశ్వవిశేషమో; ర్కొకతె వాదించున్ వితండాద్యుతిన్
లలి జాతిచ్ఛలనిగ్రహాదికమహాన్యాయాళితో జల్పముల్;
వెలుచన్ వాకొనుఁ బూరుషప్రకృతిసంభేదంబు లొక్కర్తు సం
ఖ్యలచే నెన్నుచుఁ దత్త్వముల్ మహదహంకారాదిసర్గంబులున్.

పురు—తరువాత? తరువాత?

ఉప—పూర్వరీతినే నేనును వారి సమీపమునకుఁ బోయి, వారడిగినమీఁదట "ఎవ్వనిచే జగంబు జనియించి రమించి లయించు" ఇత్యాది వాక్యముచేత మునుపటి యట్లే నాకార్యమును జెప్పితిని. అప్పుడు వారు నన్నుఁ బ్రత్యక్షముగాఁ బరిహసించి "ఓతాచాలురాలా! విశ్వము పరమాణువులవలనఁ గలుగుచున్నది. ఈశ్వరుఁడు నిమిత్త కారణము" అని పలికిరి. అందొకతె కోపముతో "ఓసిపాపాత్మురాలా! ఈశ్వరునే సవికారునిఁ జేసి వినాశధర్మము నాపాదించుచున్నావేమి?" అనెను. మఱియొకతె "ఓసీ! విశ్వోత్పత్తి ప్రకృతివలనఁగలిగె"నని పలికెను.

వివే—ఓహో! తర్కవిద్య లెంతదుర్మతులు! ఘటాదికమువలెనే ప్రమేయజాతము సర్వమును గార్యమనిసహిత మింతమాత్రము తెలిసికొనఁజాలకున్నారు. పరమాణువులును బ్రకృతియు నుపాదానకారణము లనుటయు నుపేక్షణీయమే.

మ. జలచంద్రుంబలె నంతరిక్షనగరస్వప్నేంద్రజాలంబు ల
ట్లలవిశ్వంబును మిథ్య, మేయమును గార్యంబౌట సాద్యంతతన్;
కలుగున్ శుక్తిని వెండియట్లు శివుగాఁగం దెల్విఁ దజ్ఞానమిక్;
పొలియుక్ స్రుక్కునఁ బన్నగభ్రమవలెక్ బోధోదయప్రాప్తిచేన్.

ఇఁక వికారశంకయు ముగ్ధవధూమానస విలసితమే. ఎట్లన—

ఉ. శాంతము నిర్మలంబును నజంబు ననంతము నిష్కలంబు నౌ
సంతతతేజ మీభువనసంభవమందు వికార మొందునే?
కాంతిని నల్లగల్వల నగంగలమబ్బులచాలు పుట్టుచో,
నింతయు నాకసంబు వహియించునె తాను వికారలేశముక్?

పురు—సాధు! సాధు! ప్రజ్ఞావంతుఁడవయినయీనీవిమర్శనము నాడెందమునానందపెట్టుచున్నది. (ఉపనిషద్దేవినిగూర్చి) తదనంతరము?

ఉప—తదనంతరము వారందఱును మండిపడి, "ఓహో! విశ్వవిలయముచేత ముక్తికలుగునని ప్రేలుచు, నాస్తికమార్గము నవలంబించుచున్న దీనినిబట్టి బంధింపవలెను" అని యందఱును ససంరంభముగా నన్ను నిగ్రహించుట కుద్యుక్తలైరి.

పురు—(భయముతో) ఆపయిని?

ఉప—ఆపైని నేను మిక్కిలి త్వరితముగాఁ జని దండకారణ్యములోఁ బ్రవేశించితిని. అతటమందరగిరికి సమీపమునఁగట్టఁబడిన మధుసూదనాలయము చేరవను—

ఉ. బాహులకంకణావళులు భగ్నము చేసిరి రాల రత్నముల్;
ద్రోహమతిన్ శిరోమణుల దొంగిలఁ ద్రెంచిరి కేశపాశముల్;
దేహళిఁ దారహారములు ద్రెంచి, హరించిరి కట్టుబట్టయున్;

పుర—తరువాత? తరువాత?

ఉప—అప్పుడు దేవాలయములోనుండి వెడలివచ్చి గదాపాణులైన పురుషులు వారి నతినిర్దయముగా మోదఁగా భీతులై యందఱును దిగంతములకుఁ బాఱిపోయిరి.

వివే—(హర్షముతో) పూజ్యురాలవయిన నిన్నతిక్రమించువారిని విశ్వసాక్షియైన భగవంతుఁడు క్షమింపఁడుగదా?

పుర—తరువాత? తరువాత?

ఉప—దేహముతూల, నందియలు ద్రెళ్లఁగ, గీతగృహంబు చొచ్చితిన్. అక్కడ నాకూఁతురైన గీతాదేవి చేరవచ్చిననన్నుఁ జూచి, సంభ్రమముతో "అమ్మా! అమ్మా!" అని కౌఁగిలించుకొని కూరుచుండఁబెట్టెను. అప్పుడామె నావృత్తాంతమును విని "అమ్మా! నీవు మనస్సులో ఖేదమును బొందఁబోకు. ఏఖలులు నిన్నప్రామాణికురాలినిగాఁ జేసి యథేష్టముగా నాసురబుద్ధులయి చరింతురో వారి నీశ్వరుఁడే శిక్షించును. అట్టివారినిగూర్చి భగవంతుఁడు గీతలయందు—

"గీ. అట్టిక్రూరులఁ బాపుల నధమనరుల
ద్వేషయుక్తులఁ ద్రోయుదుఁ దీవ్రగతిని
సంతతము నేను సంసారసాగరముల
లోన నొక్కటనాసురయోనులందె."

అనెను.

పుర—(సకౌతుకముగా) దేవీ! ఆయీశ్వరుఁ డెవఁడో నీయనుగ్రహమువలనఁ దెలిసికొనఁ గోరుచున్నాను.

ఉప—(కోపించినదానివలె) ఎవ్వఁడు తన్నుఁదాఁ దెలిసికోలేక యంధునివలెఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడో యతఁడే.

పుర—(హర్షముతో) ఏమి! నేనే యాపరమేశ్వరుఁడనా?

ఉప—అవును.

గీ. పరుఁడు నీకంటెఁ గాఁ డల్ల పరమపురుషుఁ;
డన్యుఁడవు గావు నీ వామహాత్ముకంటె;

నన్యుఁగా మాయచేఁ దోఁచె దశనికంటె.
నంబువులయందు సూర్యబింబంబు పగిది.

పురు—(వివేకునితో) దేవా! ఈదేవి చెప్పినను, నేనీయర్థమును జక్కఁగా గ్రహింప లేకున్నాను.

క. భిన్నున్ సుశరీరావ
చ్ఛిన్ను జరామరణఖిన్నుఁ జెన్నుగ నన్నున్
సన్నుతిచేసెడు నీయమ,
యన్నన్నా! నిత్యసచ్చిదానందునిగన్.

వివే—పదార్థపరిజ్ఞానము లేకపోవుటవలన నీకీవాక్యార్థము బోధపడ లేదు.

పురు—అది నాకు బోధపడుటకు మీరుపాయము సెలవియ్యవలెను.

వివే—ఇదిగో చెప్పుచున్నాను—

మ. కడు నీయందుఁ జిదాత్ముఁగని, యహంకారుండఁ గానంచు నె
ప్పుడుఁ జిత్తంబు నడంచి, తత్త్వసమితిం బోకార్చి కావింతువే
న్గడఁకం దత్త్వమసీతి సంస్మరణ, కన్పట్టున్ భవోద్వృత్తమం
బడఁగన్ శాంతము స్వప్రకాశ మగునిత్యజ్యోతి హర్షాత్మకన్.

పురు—(ఆనందముతో విన్నయర్థము నాలోచించుకొను చున్నాఁడు.)

అప్పుడు నిదిధ్యాసనుఁడు ప్రవేశించుచున్నాఁడు.

నిది—"నాయభిప్రాయమును నీవు వివేకునితో నున్నయుపనిషద్దేవికి నిగూఢముగా బోధపఱుపవలయును. నీవు పురుషునిలోఁ బ్రవేశింపవలెను" అని భగవతియైన విష్ణుభక్తిదేవి నాకానతిచ్చినది. (చూచి) ఇదిగో దేవి వివేకపురుషులతోడఁ గూడి సమీపమునసే యున్నది. ఆమె సన్నిధికిఁ బోయెదను. (చేరువకుఁబోయి యుపనిషద్దేవితో జనాంతికముగా) అమ్మా! "దేవతలు సంకల్పమాత్ర సంభవులు. నీవు గర్భము ధరించియున్నదానవని నేను యోగధ్యానముచేతఁ దెలిసికొన్నాను. క్రూరసత్త్వయైన విద్యయను కన్యకయుఁ బ్రబోధచంద్రుఁడును నీగర్భమునందున్నారు. అందు విద్యను సంకర్షణవిద్యచేత మనసునందు సంక్రమింపఁజేసి, ప్రబోధచంద్రునిఁ బురుషునికి సమర్పించి, నీవు వివేకునితోడఁగూడ నాయొద్దకు రావలసినది." అని విష్ణుభక్తిదేవి యాజ్ఞ యిచ్చినది.

ఉప—దేవి యాదేశించినట్లు చేసెదను. (అని వివేకునితోడ నిష్క్రమించు చున్నది.)

నిది—(పురుషునిలోఁ బ్రవేశించుచున్నాఁడు.

పురు—(ధ్యానము నటించుచున్నాఁడు.)

(నేపథ్యమునందు) ఆశ్చర్యము! ఆశ్చర్యము!

మ. ఉరుకాంతిచ్ఛటలన్ దిశావళుల విద్యుల్లీల వెల్గింపుచున్,
ఖరదీప్తాప్తివిశాలమూ మనసువక్షంబుచ్ఛిప్పోఁ బట్టి, త
త్పరివారంబును మోహుని న్సేనవి, విద్యాకన్య తోడ్తో నగో
చరయై పోయెఁ; బ్రబోధచంద్రుఁడును దా జన్మించె జీవు న్గనన్.

[అప్పుడు ప్రబోధచంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ప్రబో—ఉ. స్యూతమొ, వ్యాప్తమో, మఱియపోహితమో, యపసారితంబొ, స
భూతవిలాపితంబొ, హృతమో, యనుతర్కము లేక, యేనిసం
జాతముచేఁ బ్రపంచము వెసం జెడునో సహజప్రకాశలీ
నాతతరూపమై, యలమహాత్ముఁడ నేను బ్రబోధచంద్రుఁడన్.

(ముందుకు నడిచి) ఇతఁడె పురుషుఁడు. ఈతనిదాపునకుఁ బోయెదను. (సమీపించి) దేవా! ప్రబోధచంద్రుఁడను నేను నమస్కారము చేయుచున్నాను.

పురు—(ఆహ్లాదముతో) వత్సా! రమ్ము నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

ప్రబో—(ఆలింగనము చేయుచున్నాఁడు)

పురు—(ఆనందముతో) ఓహో! ఇప్పుడు విధూతతిమిరజాతమయి ప్రభాతః సంజాతమయినది.

ఉ. ఒకటఁ బ్రబోధచంద్రమహితోదయ మాటను జేసి యియ్యెడన్
బ్రకటవికల్పనిద్రయును బ్రస్ఫుటమోహతమంబుఁ బాయఁగాఁ,
జకచక నేనె శ్రద్ధ మతి శాంతి వివేక శమంబు లాదిగా
సకలజగన్మయుండయి యెసంగెదువిష్ణువుగా స్ఫురించెదన్.

సర్వవిధములచేతను నేను విష్ణుభక్తిదేవిప్రసాదమువలనఁ గృతకృత్యుఁడ నయినాఁడ; అట్టి నేనిప్పుడు—

చ. విడిచి సమస్తసంగములు, వేఁడక విశ్వములోని నేదియున్,
గడలనో మూలలందో ఫలకాంక్షయొనర్పక సంచరించుచున్,
సుడివడుకోపమున్ భయము శోకము మోహము నుజ్జగించి, యి
ప్పుడె మునినైతి శాంతి భృశముం గని, రాత్రియె నిల్చి తావుగన్.

[అంతట విష్ణుభక్తిదేవి ప్రవేశించుచున్నది.]

విష్ణు—(హర్షముతో సమీపించి) శమితారాతివై యున్న నన్నిప్పుడు చూచుచున్నానుగాన, చిరకాలమునకుఁగదా నామనోరథములన్నియు సంపూర్ణములయిన

పురు—దేవిగారి ప్రసాద మున్నప్పుడు దుష్కర మేదియుండును? (అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

విష్ణు—(పురుషుని లేవనెత్తుచు) వత్సా! లెమ్ము. ఇంకను నేను నీకేమి ప్రియము చేయుదును?

పురు—ఇంతకంటె నాకుఁ బ్రియమేమున్నది?

క. కృతకృత్యుండయ్యెను దా
హతవిమతస్తోముఁ డగుచు నల్లవివేకుం;
డతిదళితరజస్కుఁడనై
యతులసదానందపదవి నందితి నేనన్.

అయినను దా నీభరతవాక్యము సిద్ధించును గాక!

చ. ఇలపయి నిస్తనృష్టిఁ గురియించును గావుత మేఘుఁ డెంతయున్!
గలుముల రాజు లేలుదురు గాక మహీన్నిరుపద్రవంబుగన్!
వెలితెలివిం దమంబడఁచి, ధీ మమతా విషయోగ్రపంకమై
కలఁచు భవాబ్ధి దాఁటుదురు గాక మహాత్ములు నీదుసత్కృపన్.

సంపూర్ణము.

మాడపాటి రామచంద్రరావు, అరిగె రామస్వామి ప్రభృతులున్నారు. ఆంధ్ర మహాసభకొక నియమావళిని (Constitution) ఆమోదించడం ఈ సమావేశ కార్యక్రమంలో ముఖ్యాంశం.

సిరిసిల్ల ఆంధ్ర మహాసభ తరువాత తెలంగాణా ఆంధ్రోద్యమం ఉన్నత శిఖరాల కెగబ్రాకింది. నాలుగు మహాసభలతో ప్రజల దృక్పథం విశాలమై, ఆంధ్ర మహాసభ ప్రజలను ఏక ముఖానికి తెచ్చేందుకు ఆలోచనలు జరిపే సభగానూ, తెలంగాణా వాసుల జాతీయ మహాసభగానూ ఉన్నదని యావన్మందికీ విశ్వాసం కలిగింది. ఈ ఉద్యమం తీవ్రమైన రాజకీయ పరిణామాలను కల్పించే ఉద్యమమే అని నిజాం ప్రభుత్వం ఆరాట పడజొచ్చింది. ఈ సిరిసిల్ల మహాసభ జరిగిన ఆరు నెలలకు హనుమంతరావు పంతులుగారు ప్రభుత్వ ప్రచురణల శాఖ అధ్యక్షులుగా వున్న నవాబ్ అలీ యావర్ జంగ్‌ను కలుసుకొనడానికి వెళ్ళగా మాటల సందర్భంలో ఆయన "మీ ఆంధ్రోద్యమం యొక్క ఉద్దేశం ఈ రాజ్యంలో వున్న ఆంధ్రజిల్లాలను మద్రాసు ప్రాంతంలోని ఆంధ్ర జిల్లాలతో కలిపివేయవలెనని వున్నట్లు ప్రభుత్వం వారికి తెలియవచ్చింది. నేను ఆ విషయాన్ని రాజకీయ శాఖ మంత్రికి వ్రాశాను" అన్నారట. పంతులుగారు అది తప్పు టభిప్రాయమని వెంటనే ఖండిస్తూ అటువంటి కోరిక రాజ్యాంగ విధానాన్ని బట్టి అసంభవమని అన్నారు. అంతేగాక నిజాం ప్రభుత్వానికి విశ్వాసం కలుగజేసే ఉద్దేశంతో పంతులుగారు సిపాయీల తిరుగుబాటు తర్వాత 1885 లో విక్టోరియా మహారాణి బ్రిటిషు ప్రభుత్వం దేశీయ రాజ్యాలను తన పాలనలో ఉన్న ప్రాంతంలో కలుపుకోదనీ, ఆ విధానాన్ని వదులుకున్నామనీ చేసిన ప్రకటనను ప్రస్తావించి "నేను ఈ సంవత్సరం పొడవునా ఆంధ్ర మహాసభ స్థాయీ సంఘానికి అధ్యక్షుడను. మీ అభి

ప్రాయం నిరాధారమనీ, సత్యదూరమనీ ప్రకటించడానికి నేను ఎన్న డైనా సిద్ధంగా వున్నాను" అని పంతులుగారు సమాధానం చెప్పారు.

సిరిసిల్ల మహాసభల తర్వాత ఆంధ్ర మహాసభ కార్యక్రమాలను ఆక్షేపించడానికి హైదరాబాదు ఉర్దూపత్రికలకు ఆధారాలేవీ దొరకలేదు. అంతకుముందు కొన్ని ఉర్దూపత్రికలు హిందువు అయినవాడు ఏ ప్రజా హిత కార్యాన్ని చేపట్టినా, అది మతవిషయకమైనదైనా, విద్యా వైజ్ఞానిక సంఘసంస్కార విషయాలకు సంబంధించినదైనా, అటువంటి ఉద్యమ వ్యాప్తి జరిగితే అది ఇచటి ముస్లిం ప్రభుత్వానికీ, ఇచటి ముస్లిముల అభ్యుదయానికీ భంగం కలిగించకపోదన్న భయంతో దానిని అడ్డగించ డానికి సర్వశక్తులనూ ధారపోయడం వాడుకగా ఉండేది. అయితే హిందువులచే నడపబడే ఉర్దూపత్రికలూ, స్థానిక, వెలుపలి తెలుగు పత్రి కలూ ఆంధ్రోద్యమ వికాసాన్ని బహుధా ప్రశంసిస్తూ వ్రాశాయి. ముఖ్యంగా యువకులలో హెచ్చు ప్రబోధం జరిగింది. ఈ సిరిసిల్ల మహాసభతోనే బద్దం యల్లారెడ్డిగారి ప్రజాహిత జీవితం ఆరంభమైంది. వీరు యువకులతో ఒక స్వచ్ఛంద సేవకుల దళాన్ని ఏర్పాటుచేసి సిరిసిల్ల ఆంధ్రమహాసభ సమావేశం సందర్భాన ఎంతో సేవచేశారు. బద్దం యల్లా రెడ్డిగారు తర్వాత ప్రముఖ కమ్యూనిస్టు నాయకులుగా భారతదేశంలోనే విఖ్యాతులైనారు.

సిరిసిల్ల ఆంధ్రమహాసభ సందర్భంగా జరిగిన మహిళా మహా సభకు హనుమంతరావు పంతులుగారి సతీమణి మాడపాటి మాణిక్యమ్మ గారు అధ్యక్షురాలు. తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రలో భర్త మహా సభకు అధ్యక్షులుగాను, భార్య మహిళాసభకు అధ్యక్షురాలుగానూ ఉండడం ఈ ఒక్క పర్యాయంమాత్రమే జరిగింది. మాణిక్యమ్మగారు మహిళామహాసభను హుందాగా చక్కగా జరిపారు. తమ ఉపన్యాసంలో

స్త్రీలసమస్యలను విపులంగా ప్రస్తావించారు. నారీలోకం నూతన చైతన్య స్ఫూర్తితో ముందంజ వేయవలెనని ఆమె ఉద్బోధించారు. సిరిసిల్లసభల సందర్భంలో ఈ దంపతుల ఫోటోలు ఒకచోటచేర్చి లాకెట్లు తయారు చేయించి, విక్రయించారు. మహిళా మహాసభకు ఆహ్వానసంఘం అధ్యక్షురాలుగా జోగినేపల్లి రాధాబాయమ్మ ఉన్నారు. ఈ మహిళా మహాసభ తర్వాత విద్యావంతులైన స్త్రీలు, ముఖ్యంగా పరదాపద్ధతి పాటించేవారు ఆంధ్రోద్యమంలో, సంఘ సంస్కరణ కార్యక్రమాలలో పాల్గొనడానికి ఉత్సాహంగా ముందుకు వచ్చారు.

సిరిసిల్ల ఆంధ్రమహాసభకు అధ్యక్షులైన తర్వాత హనుమంతరావు పంతులుగారు ఆంధ్రజన కేంద్రసంఘం కార్యదర్శిపదవిని వదులుకొని ఆంధ్రమహాసభ వ్యవస్థానిర్మాణం గావించడంలో నిమగ్నులయ్యారు. కేంద్రసంఘ కార్యదర్శి పదవిని మందుముల రామచంద్రరావుగారు వహించారు.



ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారు,
వారి సతీమణి శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మగారు.

# రాజకీయ సంస్కరణలకు యత్నాలు

మాడపాటి హనుమంతరావుగారు వారి ప్రజాహిత జీవితంలో పలుసంస్థల కార్యనిర్వాహక వర్గాలలో ఏదో పదవియందు ఉంటూఉండే వారు. ఆ సంస్థలవారే వీరిని గౌరవార్థం అట్లా ఉండవలసిందనికోరడం కూడా జరిగేది. పదవిలో ఉన్నా లేకపోయినా, ఆ సంస్థకు తమ సేవ అవసరమని భావించిన పక్షంలో పంతులుగారు దానికి తగిన సహాయ సహకారాలు అందిస్తూ ఉండేవారు. అయినప్పటికీ కొన్ని ప్రధానసంస్థల పదవులలో వీరిపేరు కనిపించేది. వాటన్నిటినీ ఇక్కడ పేర్కొనడం సాధ్యంకాదు. పంతులుగారు నిజాంపాలిత ప్రజలసంఘం (Nizam's Subjects' League) అనేసంస్థలో కార్యనిర్వాహకవర్గ సభ్యులు. ఇది స్థానికులైన ముల్కీల హక్కులను కాపాడటానికీ (ఆ కాలంలో ఉత్తర దేశీయులు హైదరాబాదు వచ్చి ఇక్కడ ప్రాపకం సంపాదించి పెద్ద పదవులు సంపాదిస్తూ ఉండేవారు. యోగ్యతగల స్థానికులకిది అన్యా యంగా ఉండేది), పౌరసత్వపు హక్కులు పొందడానికీ, రాజకీయ సంస్కరణలు సాధించడానికీ ఏర్పాటు చేయబడింది. దీనిని ఉర్దూలో 'జమియతె రియాయాయె నిజామ్' అనేవారు. ఈ సంస్థకు ఉన్నత వంశంవారూ, విద్యాధికులూ, ఆంగ్లంలో కవిత్వం వ్రాసేవారూ అయిన సర్ నిజామత్‌జంగ్ అధ్యక్షులు. డా. లతీఫ్ సయీద్, రామచంద్ర నాయక్‌గారలు ఉపాధ్యక్షులు. బూర్గుల రామకృష్ణారావు, శ్రీనివాసశర్మ గారలు కార్యదర్శులు. కాని ఈ సంస్థ బాధ్యతాయుత ప్రభుత్వంకొరకు ప్రయత్నించేదిగా ఉన్నందువల్ల నిజాంప్రభుత్వం దీనిని విఫలం చేసింది.

నిజాం ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణలను సూచించడానికై దివాన్ బహదూర్ అరవముదయ్యంగార్ అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ వారికి ప్రజల మనోభావాలను అభిప్రాయాలనూ తెలియజేసి, రాజకీయ సంస్కరణల స్కీమునొకదానిని సిద్ధపరచి, వారికి సమర్పించడానికై హైదరాబాదు ప్రజా పరిషత్తు (హైదరాబాదు పీపుల్స్ కన్వెషన్) అనే సంస్థ తరఫున ప్రత్యేకంగా ఒక కమిటీ నియమింప బడింది. ఈ కమిటీకి మాడపాటి హనుమంతరావుగారు అధ్యక్షులుగా నియమింప బడటం ఒక విశేషం. పీపుల్స్ కన్వెషన్‌లో హిందూ, మహమ్మదీయ ఆంధ్ర మహారాష్ట్ర, కర్నాటక ప్రముఖులెందరో న్యాయవేత్తలెందరో ఉండగా పంతులు గారిని అధ్యక్షులుగా ఎన్నుకోవడం ఇటు ప్రజాసంస్థలలోనూ, అటు ప్రభుత్వ వర్గాలలోనూ వారిపై గల గౌరవాభిమానాలే తప్ప వేరే కారణం ఏమీలేదు. ఈ కమిటీలో ఇంకా బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, మందుముల నరసింగరావు, గోవిందరావు నానల్, జి. రామాచారి. జనార్ధనరావు దేశాయి, రాజా పన్నాలాల్ పిట్టి, శ్రీధర వామన నాయక్ ప్రభృతులు సభ్యులుగా ఉన్నారు. కుమారి పద్మజానాయుడును కూడా సభ్యురాలుగా చేర్చుకున్నారు. ఈ కమిటీ ఒక స్కీము సిద్ధ పరచి అయ్యంగార్ కమిటీకి, ప్రభుత్వానికి సమర్పించు కొన్నది. కాని నిజాం ప్రభుత్వం ఆ స్కీము ఆచరణీయం కాదనే సాకుతో దానిని తోసిపుచ్చింది. అసలు వారికి రాజ్యాంగ సంస్కరణలు అమలు చేసే ఉద్దేశం ఉంటేకదా ! ఈ స్కీమును ఇంగ్లీషు నుండి హనుమంతరావు పంతులుగారే 'నిజాం రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణలు' అనే పేరుతో తెలుగులోకి అనువదించారు. ఇది 80 పేజీల గ్రంథం. అప్పటి ప్రజానాయకులు ఎటువంటి రాజ్యాంగ సంస్కరణలు కోరిందీ ఈ పుస్తకం తెలియజేస్తుంది.

# రచయిత

హనుమంతరావుగారు ఉత్తమ రచయిత. కవి. మొదట్లో కవిత్వం వ్రాసేవారు. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయ వ్యవస్థాపకులైన శ్రీ రావిచెట్టు రంగారావుగారు పరమపదించినప్పుడు పంతులుగారు వ్రాసిన పద్యాలు కొన్ని :

చ॥ నయగుణ భూషణుండు, పర
నారులకెల్లను సోదరుండు,
నిత్యయశు డనన్య లభ్య సముదార చరిత్రుడు
సాహసాత్ముడున్: దయకును
సౌహృదంబున కుదాత్తనిదానుడు;
సర్వసజ్జనప్రియుడగు వానినిట్లు
విపరీతపుకాలమ ! మ్రింగివైచితే !

మ॥ అమలస్వాంతత నెవ్వడాంధ్ర
సుకలావ్యాప్త్యర్థమై సత్సమాజములన్
సర్వజనోపయోగమునకై స్థాపించె,
నెవ్వానికిన్ సముదౌనాతడు గానగాబడుట
దుస్సాధ్యంబొ, యెవ్వాని నామము
నేడీగతి మాపికొంటివె
నిజాం రాష్ట్రాంధ్ర భూభాగమా !

వీరు స్వయంగా వ్రాసిన ఒక కావ్యఖండికలోని పద్యం ఇట్లా ఉన్నది :

ఫలములచేత గొన్నిటిని బల్లవసంతతిచేత గొన్నిటిన్
సలలితసౌఖ్యదాయియగు ఛాయను గొన్నిటి వేవిధాల నీ
యిలను ననేకప్రాణుల కహీనసుఖంబిడు వృక్షరాజమున్
బలుపడి పీకివై చితె తుపాన! వినాశముచేసి వైచితే!

ఫిరదౌసి రచించిన ఫారసీ కవితకు పంతులుగారి అనువాదం— మచ్చుకు ఒక పద్యం——

హీనుల మహోన్నతపదవి కెత్తుటయును
ఎత్తి వారి యుపకృతి నాశించుటయును
స్వీయ మానధనము బుగ్గిసేయుటగును
సర్పమును దనజేబులో సాదుటగును

అయితే ఆంధ్రోద్యమంలో నిమగ్నులైన తరువాత వీరికి పద్యాలు రచించే అవకాశమే లేకపోయింది. అంతేకాక ఆధునికకాలపు అవసరాల దృష్ట్యా వచనరచనకే వీరు తమ లేఖినిని ఉపయోగించవలసి వచ్చింది.

పంతులుగారు తొలుత రచించిన గ్రంథం బెంగాలీ నవలా రచయిత బంకించంద్ చటర్జీ వ్రాసిన సుప్రసిద్ధ నవల 'ఆనంద మఠము' నకు తెలుగు అనువాదం. అయితే అది అచ్చు కావడానికి ముందే దొరసామయ్య గారి అనువాదం ప్రచురింప బడటంచేత వీరు తమ తెనుగు సేతను ప్రకటించలేదు. తరువాత వీరు ఇటలీ దేశభక్తుడూ మహాపురుషుడూ అయిన గ్యారీబాల్డీ జీవిత చరిత్రను 1911 లో రచించారు. ఈ గ్రంథాన్ని ప్రకటిస్తామని మచిలీపట్టణములోని ఆంధ్ర భాషాభివర్ధినీ సంఘం వారు వ్రాతప్రతిని తెప్పించుకొని అప్పటి కాల పరిస్థితులవల్ల కొంత జాప్యం జరగడంచేత ఆలోపుగా వేరొకరు గ్యారీబాల్డీ జీవితచరిత్ర ప్రకటించారు. అది తెలిసి పంతులుగారు తమ

రచనను ప్రకటించడం మానుకొన్నారు. తెలుగులో లేని పుస్తకాలు వ్రాసి ప్రకటించవలె గాని ఉన్న పుస్తకాలనే మరల మరల ప్రకటించడం వీరికి ఇష్టం లేదు. అందువల్ల పుస్తకాల సంఖ్య పెరుగుతుండే గాని, వాఙ్మయానికి అది పుష్టికాదని వీరి దృఢ విశ్వాసం. వీరు రచించిన మూడవ గ్రంథం 'రోమక సామ్రాజ్య చరిత్రము'. ఇది అసంపూర్ణ రచన. అయినా ఇది ప్రకటింప బడవలసి ఉండె. ఎందువల్లనో వీరు దీనిని అచ్చు వేయించలేదు.

'క్షాత్ర కాలపు హింద్వార్యులు' అనేది పంతులుగారి మరొక గ్రంథం. బొంబాయి వాస్తవ్యులూ, పంతులుగారి మిత్రులూ అయిన రావు బహదూర్ చింతామణిరావు వైద్య రచించిన 'ఎపిక్ ఇండియా' అనే ఆంగ్ల గ్రంథంలోని వ్యాసములకు ఇది ఆంధ్రానువాదం. దీనిని పువ్వాడ వెంకటప్పయ్య గారు వారి కృషి ప్రచారిణీ గ్రంథమాలలో రెండవ కుసుమముగా 1927 లో ప్రచురించారు. ఆర్యుల దుస్తులు, వారి ఆహారం, వివాహపద్ధతి, రాజ్యాంగ విధానం మొదలగు విషయాలు ఈ గ్రంథంలో పరిశోధనా పూర్వకంగా చర్చింపబడ్డవి. ఆర్యుల సంస్కృతిని సంప్రదాయాలను తెలుసుకొనడానికి ఈ గ్రంథం ఉపకరిస్తుంది.

వైద్యగారు ఆంగ్లంలో రచించిన 'మహాభారత సమీక్ష' అనే గ్రంథాన్ని కూడా హనుమంతరావు గారు 1916 లో తెనిగించారు. దీనిలో నుంచి కొన్ని అధ్యాయాలు ఆంధ్ర భారతి, దేశబంధు మున్నగు పత్రికలలో ప్రకటిత మయ్యాయి.

ఫారసీ కవులను గూర్చి పంతులుగారు వ్రాసిన వ్యాసాలు 'సుజాత' పత్రికలో ప్రకటింప బడ్డవి. పంతులుగారి వ్యాసాలన్ని ఒక సంపుటిగా వెలువడవలసి ఉన్నది.

తెలుగులో ఆధునిక రీతిలో కథానికను రచించిన ఖ్యాతి హనుమంతరావు గారిదా లేక ఆ గౌరవం గురజాడ అప్పారావు గారికి దక్కుతుందా అనే విషయంలో అభిప్రాయ భేదానికి తావున్నట్లు కన్పిస్తున్నది. 1910 ప్రాంతాలలోనే హనుమంతరావు గారి కథలు కృష్ణా పత్రికలో ప్రకటింప బడ్డాయని చెబుతారు. ఆదిరాజు వీరభద్రరావు గారు "కథానికలనూ నూతన రీతిలో వ్రాసిన కీర్తి హనుమంత రావుగారికే చెందవలసి ఉన్నదని చెప్పుటకు మిగుల సంతోషిస్తున్నాము" అని వ్రాశారు.* పంతులుగారు మొత్తం 13 కథలు రచించారు. వాటిలో నుంచి 1. హృదయ శల్యము 2. రాణీసారంధ్రా, 3. ముసలిదాని యుసురు, 4. వేనే, 5. అగ్ని గుండము, 6. నాడు నీ పంతము—నేడు నా పంతము, 7. ఆత్మార్పణము అనే కథలు 'మల్లికా గుచ్ఛము' అనే పేరుతో 1911 లో పుస్తక రూపంగా వచ్చాయి. ప్రకటించిన వారు సరస్వతీ నికేతనము, మచిలీపట్టణం. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారు ప్రకటించిన 'కవిత్వవేది' గారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము' లో "హనుమంతరావు గారి మల్లికాగుచ్ఛ మొప్పులకుప్ప" అని ప్రశంసించి ఉన్నారు. అయితే వీరి ఇంటి పేరును పొరపాటున మైనంపాటి అని వ్రాశారు. మాడపాటి అని ఉండవలెను. 'విధి ప్రేరణము', 'ఎవరికి?' అనే కథలను హైదరాబాదు లోని అణా గ్రంథమాలవారు 1940 లో తమ 12 వ కుసుమంగా 'మాలతీగుచ్ఛము' అనే పేరుతో ప్రకటించారు.

'న్యాయమా?' 'ఎవరిది తప్పు?' 'ఇక కావలసినదేమి?' 'నిజమేనా' అనే కథలు సుజాత, భారతి, శారద మాస పత్రికలలో అచ్చు అయినవి.

---

* మాడపాటి హనుమంతరావు జీవిత చరిత్ర
—రచన : ఆదిరాజు వీరభద్రరావు — 1965.

ఈ కథలలో 'హృదయ శల్యము', 'సేనే' అను రెండు కథలు మాత్రమే హనుమంతరావు పంతులుగారి సొంత రచనలు. తక్కినవి ప్రఖ్యాత ఉర్దూ కథా రచయిత మున్షీ ప్రేమ్‌చంద్ కథలకు అనువాదములు, అనుసరణలు. అయితే ప్రేమ్‌చంద్ ఉర్దూ కథలను మొట్ట మొదట తెనిగించి ఆంధ్రులకు పరిచయం చేసిన గౌరవం మాత్రపాటి హనుమంతరావు పంతులుగారికే దక్కుతుంది. వీరి అనువాదాలు చదివిన పిమ్మట తెలుగులో ఎందరో రచయితలు ఆ పద్ధతిలో కథా రచన చేశారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు వారు 1984 లో హనుమంతరావు పంతులుగారి శత జయంతి కానుకగా 'మల్లికా గుచ్ఛము' కథా సంకలనాన్ని తిరిగి ప్రచురించారు. ఇందులో మొదటి ముద్రణలోని ఏడు కథలతోపాటు 'ఎవరిది తప్పు?' అనే కథనూ, అణా గ్రంథమాల వారు 'మాలతీ గుచ్ఛము' అనే పేరుతో ప్రకటించిన 'ఎవరికి?' 'విధి ప్రేరణ' అనే కథలనూ కూడా చేర్చి, మొదటి ముద్రణకు పంతులుగారు వ్రాసిన పీఠికతో సహా ప్రచురించారు. ఈ కథా సంపుటి ప్రకటన ప్రశంసనీయమైన కార్యం. ఈ తరం వారికి వెనుకటి కథలను చదివే అవకాశం కలుగుతుంది.

పంతులుగారు సొంతంగా రచించిన కథలలో 'హృదయశల్యము' చారిత్రక కథ. కాకతీయ సామ్రాజ్య ధురీణ రుద్రమదేవి కాలం నాటి కథ ఇది. ఈ కథలో రుద్రమదేవి ఒక పాత్రకూడా. ప్రతాపుడు, అతని భార్య యమున ఓరుగల్లు— అంబాలకు నడుమ అరణ్య ప్రదేశం గుండా వెళ్ళుతూ ఉంటే దోపిడీ దొంగలు వచ్చి ఆ యువతిని చంపబోతున్న సమయంలో పురుష వేషంలో ఉన్న రుద్రమదేవి అక్కడికి

వచ్చి తన పట్టాక త్తితో దోపిడిగాంద్ర నాయకుని చేతిని నరికివేసి ఆ యువతిని ఆర్ద్ర హృదయంతో కౌగలించు కొంటుంది. ఎవరి దారిన వారు వెళ్ళిపోతారు. అది జరిగిన తర్వాత ప్రతాపుడు తన భార్యను అనుమానించి ఆమె పట్ల విముఖుడై ఉంటాడు. ఆ కౌగలించుకొన్న పురుషునికి ఆమె హృదయం అర్పించి ఉంటుందని అతని అనుమానం. ఇది ఇట్లా ఉండగా రుద్రమదేవి పురుష వేషంలో వచ్చి వారింట రెండు రోజులు అతిథిగా ఉంటుంది. ఆ అతిథి యమునకు ఇష్టంలేని అతిథిగా పరిణమించడంతో, అతిథియైన అతనిని పరుషవాక్కులతో ఆమె అగౌరవ పరుస్తుంది. కాని ఆమె స్త్రీ అని తెలిసిపోయి ఆ దంపతులు ఉభయులూ ఆమె పాదాలపై పడి తమ అపరాధాన్ని మన్నింపమని వేడుకొంటారు.

'నేనే' అనేది సాంఘిక కథ. దీనిలో గణపతిరావు అనే న్యాయవాది చిత్రమైన అభిప్రాయాలుకల వ్యక్తి. అతని దృష్టిలో ఒక పురుషుడు స్త్రీ సంబంధమగు విషయసుఖాభిలాష లేకపోయిన పక్షంలో అతను ఇతరత్రా సుగుణాలు, వివేకబుద్ధి లేనివాడైనాసరే, అతను నీతి వర్తనము కలవాడే! ఇట్లా అని గణపతిరావు వాదిస్తూ ఉంటాడు. ఇట్లా ఉండగా ఒక స్త్రీవద్దనుంచి అతనికి లేఖవస్తుంది. అందులో ఆమె తాను అతని గుణసంపదచే ఆకర్షితురాలైనాననీ, మరుసటిరోజు రాత్రి తనను కృష్ణా థియేటర్‌కు వచ్చి కలుసుకోవలసిందనీ కోరుతుంది. అతడు ఆ స్త్రీచే ఆకర్షితుడవుతాడు. బజారుకు వెళ్ళి మంచి బట్టలు, అత్తరు కొని ఇంటికి తెస్తాడు. భార్య అతనిని పరిహాసం చేస్తుంది. అతను థియేటర్‌కు వెళ్ళి నాటకంచూచి, ఆ సుందరికోసం ఆవరణలో వెదకుతాడు. ఒక చెట్టుక్రింద ముసుగు కప్పుకొని ఉన్న స్త్రీ అతనిని దగ్గరకు రమ్మని సంజ్ఞచేస్తుంది. అతనువెళ్ళి ఆమె ప్రసన్న వదనమును చూపమంటాడు.

తీరాచూస్తే ఆమె అతనిభార్య హేమయే. దానితో నీతివర్తనమును గూర్చిన అతని అభిప్రాయాల బండారం బైటపడుతుంది. భార్యయే నాటకమాడి అతని నీతివర్తనం ఏపాటిదో రుజువుచేస్తుంది.

ఈ రెండు కథలలోనూ మారువేషం ఉభయసామాన్యం. ఇది కథలో ఉత్కంఠను ప్రవేశపెట్టడానికై అనుసరింపబడ్డ పద్ధతి. ఆ కాలంలో ఇటువంటి నాటకీయ సన్నివేశాలుగల కథలను స్త్రీ పురుషులు ఆసక్తితో చదివేవారు. పంతులుగారి ఈ రెండు స్వతంత్ర కథలూ పాఠకులను కుతూహలంతో చదివించేవిగా ఉన్నవి. వీటిభాష సరళ గ్రాంధికము.

'నిజాం రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణలు' అనేది పంతులు గారు రచించిన మరొక పుస్తకం.

అయితే హనుమంతరావుగారికి రచయితగా చిరయశస్సు నార్జించి పెట్టిన గ్రంథం 'తెలంగాణా ఆంధ్రోద్యమము' అనే రెండు భాగములుగా ఉన్న నిజాంరాష్ట్ర ఆంధ్రోద్యమ చరిత్ర. ఆధునికయుగంలో ఆంధ్ర జాతి వికాసాన్నిగూర్చి వ్రాయదలచిన చరిత్రకారులెవ్వరూ ఈ గ్రంథాన్ని ప్రస్తావించకుండా ఉండలేరు. నిజాం నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తెలంగాణా ఆంధ్రులుసల్పిన పోరాటాన్ని ఈ చరిత్ర విశదీకరిస్తున్నది.

హనుమంతరావు పంతులుగారు చక్కని ఉర్దూ రచయిత. వీరు చాలాఏళ్ళు హైదరాబాదునుంచి వెలువడ్డ 'ముషీరెదక్కన్' అనే ఉర్దు దినపత్రికకు సంపాదకీయాలు వ్రాశారు. ఇది మితవాద పత్రిక. కాని ఇందులో వెలువడే వార్తలు వ్యాఖ్యలు యధార్థాలైఉండి పత్రిక కెంతో గౌరవ మర్యాదలు తెస్తూ ఉండేవి. పంతులుగారి సంపాదకీయాలు ఘాటుగా లేకపోయినా ప్రభుత్వ విధానంపై చేయవలసిన విమర్శను చక్కగా ప్రతిబింబించి ఉండేవి.

# షష్టిపూర్తి ఉత్సవం

నిజాం రాష్ట్రంలోని ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి నిరంతర దీక్షతో కృషిసల్పి సర్వజన సమాదరణీయులైన హనుమంతరావు పంతులుగారి షష్టిపూర్తి ఉత్సవం ఘనంగా జరుపబడవలెనని తెలంగాణా ప్రజలు అభిలషించారు. పంతులుగారు తెలంగాణాకుచేసిన సేవకు గాను వారిని ఏరీతిగా గొప్పగా గౌరవించినా తక్కువేననే అభిప్రాయం కల కొండా వెంకట రంగారెడ్డిగారు నడుము కట్టుకొని షష్టిపూర్తి జరిపే విషయంలో నాయకులు తమ బాధ్యతను నెరవేర్చవలెనని పత్రికలద్వారా విజ్ఞప్తిచేశారు. వారా విజ్ఞప్తిలో "పంతులుగారు ఆంధ్రోద్యమాన్నీ, ప్రజా గ్రంథాలయాలనూ, పాఠశాలలనూ స్థాపింపజేసి వాటి అభివృద్ధికి నిరంతరకృషి సల్పారు. ఆంధ్రులను నిద్రావస్థనుంచి మేల్కొల్పి వారిలో దేశాభిమానాన్నీ ఆత్మగౌరవాన్నీ; రాజ్యాంగభావాలనూ వృద్ధి చేశారు" అని పంతులుగారి సేవలను ఉగ్గడించారు. ఈ విజ్ఞప్తిని పురస్కరించుకొని షష్టిపూర్తి ఉత్సవనిధికి తెలంగాణావాసులు అభిమాన పూర్వకంగా విరాళాలు ఇచ్చారు. మొత్తం రూ. 11,113 వసూలయ్యాయి. ఉత్సవ నిర్వాహణకై రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు అధ్యక్షులుగా, కొండా వెంకటరంగారెడ్డిగారు కార్యదర్శిగా ఒక ఆహ్వాన సంఘం ఏర్పడింది.

పంతులుగారి షష్టిపూర్తి ఉత్సవం హైదరాబాదు నగరంలోని రెడ్డిహాస్టల్ ఆవరణంలో 1946 ఫిబ్రవరి 6, 7 తేదీలలో వైభవంగా ఒక పర్వదినంవలె మహోత్సాహంతో జరపబడింది. సభాధ్యక్షులు

ఉమ్మడి మద్రాసురాష్ట్ర మాజీమంత్రి కడప కోటిరెడ్డిగారు. మొదటిరోజున ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడులు, మహమ్మదీయులు పంతులు గారిని తీసుకురావడానికై వారి ఇంటికి వెళ్ళారు. కొండా వెంకటరంగా రెడ్డిగారు పంతులుగారికి, వారి సతీమణికి, వారి కుమారునికి నూతన వస్త్రాలు సమర్పించి చక్కగా అలంకరింపబడిన తెల్ల గుర్రపుబగ్గీలో వారిని సన్నాయివాద్యంతో, స్వచ్ఛంద సేవకులు వెంటరాగా ఊరేగింపుగా తీసుకొని వెళ్ళారు. బగ్గీకి ముందు పురుషులు, వెనుక స్త్రీలు నడిచారు. 'ఆంధ్రపితామహకు జై' అనే నినాదాలు మిన్నుముట్టాయి. దారిలో పౌరులు, కొన్ని సంస్థల వారు పంతులుగారికి పూలదండలు వేశారు. కొందరు నూతన వస్త్రాలు బహూకరించారు. ఊరేగింపు రెడ్డి హాస్టల్ ద్వారం వద్దకు రాగానే బాలికలు హారతి పట్టారు. వేద పఠనం జరుగుతూ వుండగా పంతులుగారు సభా వేదికపై ఆసీనులయ్యారు. రాజా బహద్దరు వెంకట రామారెడ్డిగారు ఆహ్వాన సంఘ అధ్యక్షోపన్యాస మిస్తూ పంతులుగారి సేవలనూ త్యాగాన్నీ కీర్తించారు. శ్రీ అరవముదయ్యంగార్ వారి ప్రారంభోపన్యాసంలో పంతులుగారి గుణగణాలను ప్రశంసించారు. సభాధ్యక్షులు బారిష్టర్ కడప కోటిరెడ్డిగారు మహోపన్యాసం చేశారు. ఆహ్వాన సంఘం వారి సన్మాన పత్రాన్ని సురవరం ప్రతాపరెడ్డి గారు చదివి సమర్పించారు. దాదాపు 63 సంస్థలు ఆంధ్ర పితామహునికి సన్మాన పత్రాలు సమర్పించి పూలమాలలతో గౌరవించాయి పంతులుగారిని కాశీనాధరావు వైద్యా, రాజా బహద్దర్ విశ్వేశ్వరనాధ్, జనార్దనరావు దేశాయి ఇతర ప్రముఖులు పుష్పమాలలతో గౌరవించారు.

తరువాత పంతులుగారి తులాభారం జరిగింది. అలంకరింపబడిన పెద్ద త్రాసులో పంతులు గారిని కూర్చుండబెట్టి వెండి రూపాయ

లతో తూచారు. రూ. 6400 ల తూకమున్నట్లు తేలింది. అంతట కొండా వెంకటరంగారెడ్డిగారు మాట్లాడుతూ ఈ పైకం పంతులుగారి సొత్తు అని, దీనిని వారు తమ ఇష్టానుసారం ఉపయోగించుకో వచ్చుననీ తెలిపారు. పంతులుగారు ఈ సన్మానానికి సమాధానం చెబుతూ తమ జీవితావసరాలకు తగినంత రాబడి తమకు ఉన్నదనీ, తులాభార పైకం అంతటినీ కొండా వెంకట రంగారెడ్డిగారు అవసరమని భావిస్తే ఇతరులనుకూడా చేర్చుకొని ప్రజాహిత కార్యాలకు ఉపయోగింప వచ్చునని రెడ్డిగారికి అధికార మిచ్చారు. తమకు ఈ ప్రకారంగా సన్మానం జరుగుతుందని ముందుగా తెలిస్తే ఇంకా ఎక్కువ సేవచేసి, తూకం ఎక్కువ కావడానికి ప్రయత్నించి ఉండేవారమని చమత్కారంగా అన్నారు. తాను ప్రవక్తను కాననీ, ప్రభుత్వోద్యోగంలో రూ. 40 వేతనం మొదలు రూ. 100 వరకు వేతనం పొందామనీ, దానిపై అభిరుచి లేక వకీలువృత్తిని ఆరంభించామనీ, ప్రజలకు సేవచేయడమే తమ ధ్యేయమనీ పంతులుగారు అన్నారు.

షష్టిపూర్తి ఉత్సవం రెండవరోజుసభ పింగిలి వెంకట్రామారెడ్డి దేశముఖ్‌గారి అధ్యక్షతన జరిగింది. రెడ్డిగారూ, పంతులుగారూ బాల్యమిత్రులు. కలిసి చదువుకున్నవారు. రెడ్డిగారు పంతులుగారి వాక్చాతుర్యాన్నీ కార్యదీక్షనూ ఎట్టివారిపైనైనా సమ్మోహనాస్త్రం ప్రయోగింపగల వారిప్రజ్ఞనూ ప్రశంసించారు. కవిపండితులు పంతులవారిని కీర్తిస్తూ తాము వ్రాసిన పద్యాలు గేయాలు ఉత్సాహంగా చదివారు. ఈ ఉత్సవం సందర్భంగా 'ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరాయ షష్టిపూర్తి సంచిక' ప్రచురింపబడింది. దానిని పంతులుగారికి సమర్పించారు. ఇందులో సాహిత్య, చారిత్రక సాంఘిక విషయాలనుగూర్చిన గద్యపద రచనలున్నవి. బూర్గుల రామకృష్ణారావు, కాశీనాథరావు వైద్య, జనార్దనరా

రావు దేశాయి, రావి నారాయణరెడ్డి, మౌల్వీ సిరాజుల్‌హసన్ తిర్మిజీ, మందుముల నరసింగరావు, పండిత ధారేశ్వర్‌జీ ప్రభృతులు హనుమంతరావుగారి సేవలనూ ప్రతిభా విశేషాలనూ కొనియాడుతూ ప్రసంగించారు. ఆ తర్వాత యోగవ్యాయామ ప్రదర్శనలు జరిగాయి. ఆ సందర్భానికి పంతులుగారి జీవిత విశేషాలు వివరిస్తూ ప్రత్యేకంగా పండితులు శిరోమణి చలమచర్ల రంగాచార్యులవారిచే రచింపబడిన బుర్రకథను ఆంధ్రమహాసభ ప్రచారకులు శ్రావ్యంగా పాడి చెప్పారు.

పంతులుగారి షష్టిపూర్తి ఉత్సవం విడిగా ఆంధ్ర మహిళాసభ, ఆంధ్ర యువతీమండలి పక్షాన, నారాయణగూడా ఆంధ్ర బాలికోన్నత పాఠశాల పక్షాన, సికింద్రాబాదు ఆంధ్రమహాసభ (జాతీయ) పట్టణ కమిటీ ఆధ్వర్యాన జరుపబడింది. ఈ సభలలో వారికి అనేక ప్రజా సంస్థల పక్షాన సన్మానపత్రాలు, నూతనవస్త్రాలు, కానుకలు సమర్పింపబడ్డాయి.

హనుమకొండ, ఓరుగల్లుకోట, ఖమ్మం, మానుకోట, మధిర, ఇల్లెందు, తల్లాడ, ఎర్రుపాలెం, బుద్ధవరం, నల్లగొండ, సూర్యాపేట, దేవరకొండ, ఘనపురం, మిర్యాలగూడెం, హుజూరునగరం, జనగామ, సంగారెడ్డి, సదాశివపేట, జోగిపేట, మహబూబునగరం, మక్తల్, నాగర్‌కర్నూలు, గూడూరు, బెజవాడ మున్నగుచోట్లకూడా పంతులుగారి షష్టిపూర్తి ఉత్సవాలు వేడుకతో జరుపబడ్డవి. వీరిని షష్టిపూర్తి సందర్భంగా అభినందిస్తూ తీర్మానాలు ఆమోదింపబడ్డాయి.

మొత్తం 27 ప్రదేశాలలో 32 సభలు జరిగినట్లు, 117 సంఘాలు పాల్గొన్నట్లు సన్మానసంఘంవారు ప్రకటించారు.

హైదరాబాదు నగరంలో మరియే ఆంధ్ర నాయకునికి షష్టిపూర్తి ఉత్సవం ఇంత ఘనంగా స్వచ్ఛందంగా వేడుకగా, అటువంటి ఉత్సాహపూరిత దృశ్యాలమధ్య, అన్ని సంస్థల ఆదరాభిమానాలతో జరగలేదని ప్రేక్షకులు చెప్పుకొన్నారు.

# ఆంధ్ర చంద్రికా గ్రంథమాల స్థాపన

తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికి దోహదం చేయడం, చరిత్ర పరిశోధన శాసనాల పరిశోధన ద్వారా చారిత్రక దృక్పథాన్ని పెంపొందింపజేయడం, విజ్ఞాన వాఙ్మయ ప్రచారం జరగడం - ఇవి హనుమంతరావు పంతులుగారి ముఖ్య లక్ష్యాలు. తెలుగులో ఈ విషయాలకు సంబంధించిన పుస్తకాలు అధికంగా వెలువడవలెనని వారు అభిలషిస్తూ ఉండేవారు. ఇందుకై వారు హైదరాబాదులో ఆంధ్ర చంద్రికా గ్రంథమాలను స్థాపించారు. దీనికి సంపాదకులుగా ఆదిరాజు వీరభద్రరావు గారిని నియమించారు. పంతులు గారి స్వగృహమైన 'ఆంధ్ర కుటీరము' దీనికి కార్యాలయం. 1946 ఫిబ్రవరి 6, 7 తేదీలలో వారి షష్టిపూర్తి ఉత్సవాలు జరిగిన సందర్భంలో తులాభారం జరిపి వారు రూ. 6,400 బరువు తూగగా ఆ ధనాన్ని వారికి సమర్పించారు. వారు ఆ ధనాన్ని తెలుగు గ్రంథ ప్రచురణకు ఉపయోగించ నిశ్చయించి ఆంధ్ర సారస్వత నిక్షేపము అనే ట్రస్టును కొండా వెంకట రంగారెడ్డి గారి అధ్యక్షతన ఏర్పాటు చేశారు. ఈ ట్రస్టుకు కోశాధిపతి పంతులుగారే. ఈ ట్రస్టు పక్షాన ఆంధ్ర చంద్రికా గ్రంథమాల ఏర్పాటైంది. ఈ గ్రంథమాలలో దేశ చరిత్రలు, మహా పురుషుల జీవితాలు, ప్రకృతి శాస్త్రాలు, ఇతర విజ్ఞానాత్మక గ్రంథాలు ప్రకటింపబడతాయని వారు పాఠకులకు, చందాదారులకు తెలియజేశారు. ఈ గ్రంథాలు ప్రజా సాహిత్య సంబంధమైనవిగా ఉండి, సులభమైన వచన శైలిలో ఆకర్షణీయంగా ఉండి, పరిమితమైన పుటలు కలిగి అందరికీ

అందుబాటులో ఉండవలెనని వారి ఆశయం. గ్రంథమాలకు చందా లేదు. గ్రంథాలు తయారు కాగానే చందాదారులకు వి. పి. పై పంప బడతాయి. వీటిని తీసుకొనేవారు శాశ్వత చందాదారు లనబడుతారు. అట్టివారికి పుస్తకాల వెలలో నాల్గవ భాగం తగ్గించి పంపుతారు. అప్పటి వరకు ఆంధ్ర వాఙ్మయంలో లేని గ్రంథాలే ప్రకటింప బడతాయనీ, ఆంధ్ర భాషకు పుష్టి కలిగించుట, ఆంధ్రులలో విజ్ఞాన చంద్రికలను ప్రసరింపజేయుట తమ ఉద్దేశమనీ, ధన సంపాదన కాదనీ వారు ప్రకటించారు. తెలుగులో వివిధ విషయాలను గూర్చిన గ్రంథజాలం అప్పటికి తక్కువ - ఇప్పటికీ తక్కువే. మహారాష్ట్రి, హిందీ, వంగ భాషలతో పోల్చితే తెలుగువారు వెనుకబడి ఉన్నారని పంతులుగారు ఆవేదన చెందేవారు. ఆంధ్ర చంద్రికా గ్రంథమాల తరఫున ఖండవల్లి బాలేందు శేఖరంగారి 'విస్మృత సామ్రాజ్యములు', పంతులు గారు రచించిన 'తెలంగాణా ఆంధ్రోద్యమం' రెండు భాగములు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము', ఆదిరాజు వీరభద్రరావుగారి 'ప్రాచీనాంధ్ర నగరములు', డా. మారేమండ రామారావుగారి 'రాజకీయ పరిజ్ఞానము', ఖండవల్లి బాలేందు శేఖరంగారి 'ప్రాచీన జాతులు', బి. వి. రమణరావుగారి 'వైజ్ఞానికుల జీవితములు' అనే గ్రంథాలు ప్రకటింపబడ్డవి. మరికొన్ని గ్రంథాలు ప్రచురింపవలెనని పథకం వేసుకొన్నారు. కాని గ్రంథ ప్రచురణ కార్యం కష్ట తరంగా ఉండటంవల్ల ఆ ఉద్యమాన్ని అంతటితో నిలిపివేశారు. ఈ గ్రంథమాల గ్రంథాలు చాలా చౌక ధరలకు ఇవ్వబడేవి. 350 పుటల 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము' ను చందాదారులకు 1950 లో రెండు రూపాయల పావలాకు ఇచ్చే వారంటే గ్రంథమాల స్థాపకుల ఉద్దేశం విదితం కాగలదు. ఈ గ్రంథానికి సురవరం ప్రతాప

రెడ్డిగారు 'నీళ్ళు లేని ఇటికేలపాడు' గ్రామం నుంచి ఉపోద్ఘాతం వ్రాస్తూ "ఆంధ్ర చంద్రికా గ్రంథమాల స్థాపకులును, పూజ్యులును నగు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు నిరంతర సంస్తవనీయులు" అన్నారు. గ్రంథ రచయిత తమ విన్నపంలో "స్వాతంత్ర్య శోభా దరిద్రాణమును, సంస్కృతి నిద్రాణమును అయిన తెలంగాణమును మేల్కొల్పిన మేధావి ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి వాక్యమును తెలంగాణపు వాణిగా గ్రహించి ఈ పుస్తకమును సమర్పించు కొనుచున్నాను" అని వ్రాశారు. ఈ గ్రంథమాల సేవ ప్రశంసనీయం. ఈ గ్రంథమాల పుస్తకాల మలి ముద్రణలు తీసుకొస్తే నేటి పాఠకుల కెంతో ఉపయోగపడతాయి.



పంతులుగారి షష్టిపూర్తి సందర్భంలో తీసిన చిత్రం.

# బాలికల ఉన్నత పాఠశాల - మహిళా కళాశాల

హైదరాబాదు నగరంలో తెలుగు బాలికలకు హైస్కూలు విద్యా సౌకర్యం కలిగిస్తూవున్న పాఠశాలల్లో 'మాడపాటి హనుమంతరావు బాలికల ఉన్నత పాఠశాల' ముఖ్యంగా చెప్పుకోదగింది. ఇది నగరంలో నారాయణగూడాలో ఉన్నది. హనుమంతరావుపంతులుగారు ఈ పాఠశాల స్థాపనకూ దీని అభివృద్ధికీ కృషిచేశారు కాబట్టి దీనికి వారిపేరు పెట్టారు. అంతకు ముందు ఇది నారాయణగూడా ఆంధ్ర బాలికోన్నత పాఠశాలగా వ్యవహరింపబడేది. పంతులుగారి స్త్రీవిద్యాభిమానం, తెలుగు బాలికలకు మాతృభాషలో ఉన్నతవిద్య గరపబడవలెనన్న లక్ష్యం వీరిని ఈ పాఠశాల స్థాపనకు ప్రేరేపించాయి. హనుమంతరావు పంతులుగారు 1330 ఫసలీలోనే అఫ్జల్‌గంజ్‌లో బాలసరస్వతీ ఆంధ్రభాషానిలయంలో నెలకొన్న పరోపకారిణీ బాలికాపాఠశాల అనే ప్రాథమిక పాఠశాల నిర్వహణభారం వహించి దానిని చక్కగా నడిపారు.

నిజాం ప్రభుత్వం రాష్ట్రంలోని బాలబాలికలందరూ ఉర్దూ భాషలోనే ఉన్నతవిద్య నభ్యసించవలెనన్న నిర్బంధవిధానాన్ని అనుసరిస్తూ పరిమితంగా మాత్రమే విద్యాసౌకర్యాలు కలుగజేస్తూ వున్న కాలమది. బాలుర విషయంలో ఎట్లాగో సరిపెట్టుకున్నా, బాలికలకు వారి మాతృభాషద్వారా ఉన్నతవిద్యను బోధించే సౌకర్యాలు లేకపోవడం పంతులుగారికి నచ్చలేదు. ఆంధ్రోద్యమం చక్కగా సాగాలంటే స్త్రీలు విద్యావంతులు కావాలి. అందుకు వారి మాతృభాష ద్వారానే ఉన్నత విద్య

గరపబడవలెనని వారు సంకల్పించారు. వీరివలెనే మహారాష్ట్ర కన్నడ భాషలవారు కూడా నిజాం సర్కారువారి విద్యావిధానాన్ని నిరసించారు. బాలికల విద్యకొరకై బారిష్టర్ రామచంద్రనాయక్, రాయ్ విశ్వేశ్వర నాథ్, అహల్యాబాయి మల్లన్న, సులోచనాబాయి, వాసుదేవహార్డీకర్, కృష్ణస్వామి ముదిరాజ్, మాడపాటి హనుమంతరావుగారలు ఒకకమిటీగా ఏర్పడి బాలికా పాఠశాల ఏర్పాటుకు ప్రయత్నించారు. ఐతే ప్రైవేటు పాఠశాలల స్థాపన విషయంలో నిజాం ప్రభుత్వం కఠిన నియమాలను అమలు జరుపుతూ ఉండేది. కొత్తగా ప్రైవేటు పాఠశాలలు పెట్టాలనుకున్న వారికి అనుమతి లభించడం కష్టంగా ఉండేది. అయితే రెసిడెన్సీ బజారు (ఇప్పటి సుల్తాన్‌బజారు) ఆనాడు బ్రిటిషువారి అధీనంలో వుండటం చేతనూ, అది బ్రిటిషు రెసిడెంటు ఉండే ప్రాంతం గనుకనూ, విద్యా బోధన విషయంలో నిజాం ప్రభుత్వ నియమాలు అక్కడ వర్తించేవి కావు. అందుచేత రెసిడెన్సీబజారులో 1928 జూన్ 8 తేదీన ఒక బాలికా పాఠశాల స్థాపించారు. కాని మరాఠీ, కన్నడ తరగతులకు తగినంతమంది విద్యార్థినులు లేకపోవడంచేత పైన పేర్కొన్న కమిటీ వారు మూడు సంవత్సరాలు పాఠశాలను నిర్వహించి, తెలుగుశాఖ మూడవఫారం వరకు అభివృద్ధి పొందిన తర్వాత ఆర్థికమైన ఇబ్బందుల మూలాన పాఠశాలను మూసివేయ సంకల్పించారు. మరాఠీ, కన్నడ తరగతులు ప్రోత్సాహంలేక తగినంతమంది పిల్లలు లేక మూసివేయ బడ్డవి. అట్టి తరుణంలో హనుమంతరావుగారు తమకు విశ్వసనీయులైన వడ్లకొండ నరసింహారావుగారిని తోడుచేసుకొని పాఠశాల నిర్వహణ భారాన్ని తమ మీద వేసుకొని, దానిని ఆంధ్ర బాలికల ఉన్నత పాఠశాలగా మార్చారు. సేవాసక్తిగలవారికీ వదాన్యులకూ విద్యాభిమానులకూ ఆంధ్ర బాలికలకు వారి మాతృభాషలోనే ఉన్నత విద్యాసౌకర్యం

కలుగజేయవలెనన్న తమ లక్ష్యాన్ని పంతులుగారు విపులీకరించి చెప్పి, అందరి సహాయ సహకారాలను తీసుకోవడానికి పూనుకొన్నారు. రాజా బహద్దర్ వెంకటరామారెడ్డిగారు ఆ కాలంలో నిజామాంధ్రులకు పెన్నిధి వంటి వారుగా ఉన్నందువల్ల వారిని పాఠశాలకు అధ్యక్షులుగా ఎన్ను కొన్నారు. వీరిద్దరితో కొండా వెంకటరంగారెడ్డిగారూ, బూర్గుల రామ కృష్ణారావుగారూ చేతులు కలిపారు. ఈ పాఠశాలకు ఒక ఆధారము, వ్యక్తిత్వము కల్పించాలని పంతులుగారి పట్టుదల. అయితే ఈ పాఠ శాలలో బోధింపబడే చదువును ఒక విశ్వవిద్యాలయంచేత ఆమోదింప జేసి, విద్యార్థినులకు సర్టిఫికెట్లు లభింపజేయాలికదా. ఆ సర్టిఫికెట్లకు పరిగణన వుండాలికదా. పంతులుగారు అందుకు పూనుకొని ఉస్మానియా నాగపూరు, ఆంధ్ర విశ్వవిద్యాలయాలవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు ఉర్దూను తప్ప మరే భాషనూ తాము అంగీకరింపమని తెలియజేశారు. నాగపూరు విశ్వవిద్యా లయంవారు తెలుగుభాషకు తమవద్ద సౌకర్యాలులేవని తెలిపారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు తమకు దేశీయ సంస్థానాల వ్యవహారంతో నిమిత్తం లేదని తప్పించుకొన్నారు. ఇట్లా చుట్టుపక్కల విశ్వవిద్యాలయాల నిరాకరణవల్ల విఫలమనోరథులైన పంతులుగారు పూనాలోని శ్రీమతి నాతీబాయి దామోదరథాకర్సే మహిళా విశ్వవిద్యాలయానికి వ్రాశారు. దీనినే ఎన్.ఎన్.డి.టి. యూనివర్సిటీ అనేవారు. ఇది భారతదేశంలో ఏర్పాటు చేయబడ్డ మొట్టమొదటి మహిళా విశ్వవిద్యాలయం. ఈ విశ్వ విద్యాలయంవారు తెలుగులో పరీక్షలు జరిపి సర్టిఫికెట్లు ఇవ్వడానికి అంగీకరించడంచేత పంతులుగారు బాలికల ఉన్నతపాఠశాలను 1932 లో ఆ మహిళా విశ్వవిద్యాలయానికి అనుబంధ విద్యాలయంగా చేశారు. వారి పాఠ్యప్రణాళిక ననుసరించి తెలుగులో బాలికలకు ఉన్నత పాఠశాల విద్య బోధించడానికి తగు ఏర్పాట్లు చేశారు.

మొదట్లో ఈ పాఠశాలకు కార్యకర్తగా, ఉపాధ్యాయుడుగా హనుమంతరావు పంతులుగారే పనిచేశారు. ఆరంభంలో పాఠశాలకు ప్రధానోపాధ్యాయిని ఎవరూలేరు. 1931 లో మొదటిసారిగా ప్రధానోపాధ్యాయుడిని నియమించారు.

పంతులుగారి సతీమణి శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మగారు 1931-32 సంవత్సరంలో ఈ పాఠశాల విద్యార్థినిగా ప్రవేశ పరీక్షకు కూర్చున్నారు.

పంతులుగారు ఇంచుమించు ప్రతిరోజు పాఠశాలకు వచ్చి ఉపాధ్యాయుల యోగక్షేమాలు విచారిస్తూ ఉండేవారు. ఈ సంస్థ ఒక పాఠశాలగాకాక తెలుగు బాలికల సమగ్రాభివృద్ధికి తగిన కేంద్రంగా ఉండవలెనని వారి ఆశయం.

నగరానికి ఏ గొప్పవ్యక్తి వచ్చినా పంతులుగారు వారిని దర్శించి, పాఠశాలనుగూర్చిచెప్పి వారిని తీసుకువచ్చి పాఠశాల పనిచేసేవిధానాన్ని వివరించి చెప్పేవారు. ఆ విధంగా ఈ పాఠశాలను దర్శించిన ప్రముఖులలో మహిళా విశ్వవిద్యాలయ స్థాపకుడు కర్వే పండితుడు, ప్రముఖ విద్యావేత్త డా. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు పేర్కొనదగినవారు.

పంతులుగారు కొత్తగా వచ్చే విద్యార్థినుల ఊరూ పేరూ అడిగి తెలుసుకొని వారి చదువు ఎట్లా సాగుతున్నదీ విచారించేవారు.

పాఠశాలలో చేరదలచుకొన్న బాలికలు పంతులుగారి ఇంటికి వెళ్ళేవారు. వారు అంతకుముందు చదివిన చదువు, తల్లిదండ్రుల వివరాలు తెలుసుకొని వారిని వెంటబెట్టుకొని పాఠశాలకు తీసుకుపోయి తగిన తరగతిలో చేర్పించేవారు. ప్రతి సంవత్సరం స్కూల్ డే జరిపి, ప్రతి

సబ్జెక్టులో ప్రథములుగా వచ్చిన బాలికలకు బహుమతులు ఇచ్చేవారు. పంతులుగారు తమ ఆదర్శాలతో ఈ పాఠశాలకు చక్కని రూపకల్పన చేశారు. పాఠ్యక్రమం ప్రకారం తరగతులను నడపడమేగాక, చిత్రలేఖనం, భగవద్గీత పరీక్షలు, బోధకవిద్య, ఖేలనాది వినోదములు, ప్రాథమిక చికిత్స, పోటీపరీక్షలు, గ్రంథనిలయం, వక్తృత్వం, వ్యాస రచన, సంగీతము, గృహనిర్వహణశాస్త్రం, నాట్యం, వ్యాయామం, గర్ల్‌గైడ్స్, బ్లూబర్డ్‌వంటి ఇతర కార్యక్రమాలతో ఈ బాలికోన్నత పాఠశాలను పంతులుగారు సర్వాంగశోభితంగా తీర్చిదిద్దారు.

1933 నుండి 1945 వరకు ఈ పాఠశాల విద్యార్థినులు కర్వే మహిళా విశ్వవిద్యాలయ పరీక్షలకు పంపబడ్డారు. ఆ తర్వాత 1945 నుండి 1948 వరకు ప్రైవేటు విద్యార్థినులుగా ఆంధ్ర మెట్రిక్ పరీక్షకు పంపబడ్డారు. 1947 లో- అంటే పాఠశాల స్థాపింపబడిన 20 సంవత్సరాలకు ఈ పాఠశాల విద్యార్థినులు తెలుగు బోధనాభాషగా హైదరాబాదు హెచ్.ఎస్.సి పరీక్షకు కూర్చోవచ్చునని ప్రభుత్వం ఆజ్ఞాపించినందువల్ల బాలికలను 1949 నుంచి తెలుగు మీడియం హైయర్ సెకండరీ సర్టిఫికెట్ పరీక్షకు పంపడం ఆరంభమైంది.

తెలుగు బోధనాభాషగా చదువుతూ వున్న కొందరు విద్యార్థినులు తాము ఉన్నత పాఠశాలస్థాయిలో తెలుగులో చదివి ఆపిమ్మట కాలేజీలో చేరితే అక్కడ ఇంగ్లీషు మీడియం కావడంవల్ల ఇబ్బంది పడతామోనని వెరచి ఇంగ్లీషు మీడియం హైస్కూళ్ళలో చేరుతూవుండడం గమనించిన పాఠశాల నిర్వాహకులు తెలుగు మీడియంతోపాటు, ఇంగ్లీషుమీడియంలో కూడా తరగతులు జరిపే ఏర్పాటుచేశారు.

1943 జనవరి 1 తేదీనాడు హనుమంతరావుగారు పాఠశాల కార్యదర్శి పదవినుండి విరమించుకొని ఆ బాధ్యతను వేరొకరికి అప్పగించారు.

సుల్తాన్‌బజారులో ఒక చిన్న అద్దె ఇంటిలో ప్రారంభింపబడిన ఈ పాఠశాల 1938 లో నారాయణగూడాలోని స్వంతభవనానికి మార్చబడింది.

1928 లో కేవలం 8 మంది బాలికలతో ప్రారంభింపబడిన ఈ పాఠశాల 1978 లో స్వర్ణోత్సవం జరుపుకొనేనాటికి 2,700 మంది విద్యార్థినులతో, 74 మంది ఉపాధ్యాయినులతో హైదరాబాదు నగరంలో పేరెన్నికగన్న బాలికోన్నత పాఠశాలగా అభివృద్ధి చెందింది. బిదురు వెంకటశేషయ్య, చలమచర్ల రంగాచార్యులు, ఆదిరాజు వీరభద్రరావు, కేశవపంతుల నరసింహశాస్త్రి, ఉప్పుటూరి రాఘవాచారివంటి పండితులు సాహిత్యవేత్తలు ఒకప్పుడు ఈ పాఠశాలలో ఉపాధ్యాయులుగా సేవ చేశారు. డా. పి. యశోదారెడ్డి, ప్రముఖ నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచన ఈ పాఠశాల విద్యార్థినులే.

తెలుగు బాలికల విద్యాభ్యాసం హైస్కూలువిద్యతో ఆగిపోకుండా కళాశాల విద్యకూడా వారికి లభింపజేయవలెనని పంతులుగారు ఉత్సహించారు. ఉదారులూ తెలుగు భాషాభిమానం గలవారూ, నిజాం రాష్ట్రాంధ్రులకు పెన్నిధివంటివారూ, ఆంధ్ర సంస్థలకు పోషకులూ అయిన రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారి పేరిట నగరంలో ఒక మహిళా కళాశాలను ఏర్పాటు చేయవలెనని సంకల్పించారు. వీరి ఈ సంకల్పానికి మిత్రుల తోడ్పాటు లభించింది. కళాశాల ఏర్పాటుకై ఒక ంఘం నియమింపబడింది. ఆ సంఘానికి అప్పటి హైదరాబాదు రాష్ట్రి

ముఖ్యమంత్రి అధ్యక్షులు, మాడపాటి హనుమంతరావు కార్యదర్శి, పి. రామచంద్రారెడ్డి సంయుక్త కార్యదర్శి. నిజాంగారిని దర్శించి బర్కత్ పురాలో 3½ ఎకరాల భూమిని సేకరించారు. ప్రభుత్వంనుంచి రూ. 25 వేల హాలీ రూ.లు మంజూరు చేయించుకొన్నారు. తమకు షష్టిపూర్తి సందర్భంలో జరిగిన తులాభారంవల్లూ ఆంధ్ర చంద్రికా గ్రంథమాల ప్రచురణల అమ్మకంవల్లా వచ్చిన సొమ్ము సుమారు రూ. 19,000 లు ఆంధ్ర సారస్వత నిక్షేపంలో నిలువవుంది. ఆ సొమ్మును పంతులుగారి అభీష్టానుసారం మహిళాకళాశాలకై 1954 లో సమర్పించడం జరిగింది. బర్కత్‌పురాలో ఈ మహిళాకళాశాల భవన నిర్మాణానికి భారతప్రధాని జవహర్‌లాల్‌నెహ్రూ 1954 జనవరి 3 తేదీన శంకుస్థాపన చేశారు. ఈ కళాశాలకు పంతులుగారు ఉపాధ్యక్షులుగా ఉండి పనిచేశారు. 1955 జనవరి 6 వ తేదీన ఈ కళాశాలకు ప్రారంభోత్సవం భారత ఉపరాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ చేశారు. 1980 అక్టోబరులో ఈ కళాశాల రజతోత్సవం జరుపుకొని నగరంలోని మహిళాకళాశాలల్లో పేర్వడసినది. ఇది ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయానికి అధ్యయన కేంద్రంగా కూడా ఉన్నది. త్వరలో పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్ కానున్నదని తెలుస్తున్నది.

# హైదరాబాదు నగర మేయరు

ప్రజాస్వామ్యపద్ధతి ప్రకారం 1951 ఏప్రిల్ 16వ తేదీన ఏర్పడ్డ హైదరాబాదు నగర పాలక సంఘానికి (హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్) మొట్టమొదటి మేయరు మాడపాటి హనుమంతరావు పంతులుగారు. ప్రధానంగా ఆంధ్ర నగరమైన హైదరాబాదుకు ఆంధ్ర పితామహుడైన పంతులుగారు ప్రథమ మేయరు కావడం సముచితంగా ఉన్నదని వారి ఎన్నిక సమయంలో సర్వత్రా హర్షం వ్యక్తమైంది. అంతకుపూర్వం ఈ నగరపాలక సంఘం నామినేటెడ్ సభ్యులతో కూడిన వ్యవస్థగా ఉండేది. దానిని ఉర్దూలో బల్దియా అని వ్యవహరించే వారు. 1951లోనే మొట్టమొదటి సారిగా వయోజన ఓటింగు పద్ధతి ప్రకారం నగరపాలక సంఘానికి ఎన్నికలు జరిగాయి. పోటీలేకుండా కాంగ్రెసు సభ్యులు ఎన్నుకోబడ్డారు అప్పుడు హైదరాబాదు నగరానికీ, సికింద్రాబాదు నగరానికీ వేర్వేరు మునిసిపల్ కార్పొరేషనులు ఉండేవి.

హైదరాబాదు నగరపాలక సంఘం మొదటి సర్వసభ్య సమావేశం 1951 ఏప్రిల్ 16వ తేదీన ఉదయం 9-30 గం.లకు మేయర్ ఎన్నిక నిమిత్తం జరిగింది. ఎన్నిక సమయంలో 65 మంది కార్పొరేటర్లు హాజరైనారు. మేయరు ఎన్నికను జరిపించడం కోసం ధరణీధర్ సంఘీగారు తాత్కాలిక అధ్యక్షులుగా ఉండి ఎన్నిక జరిపించారు. మహమ్మదు యూనస్ సలీంగారు మేయర్ పదవికి మాడపాటి హనుమంత రావుగారి పేరును ప్రతిపాదించగా యస్. వెంకటస్వామిగారు బలపరిచారు. మరొకపేరు ఏదీ ప్రతిపాదింపబడకపోవడంచేత మాడపాటి

హనుమంతరావుగారు ఏకగ్రీవంగా మేయర్‌గా ఎన్నికైనట్లు ప్రకటింపబడింది. అప్పటి హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న బూర్గుల రామకృష్ణారావుగారు హనుమంతరావుగారిని మేయర్ స్థానంలో ఆసీనులు కావలసిందిగా అర్థించారు అలాగే వారు ఆసీనులైన తర్వాత ముఖ్యమంత్రిగారు పంతులుగారికి మేయర్‌గౌను తొడిగారు. మేయర్ పోషక్‌లో ఉన్న పంతులుగారు తమను ఆ పదవి నలంకరింప జేసినందుకు ముఖ్యమంత్రికీ, స్థానిక స్వపరిపాలన మంత్రికీ, మునిసిపల్ కార్పొరేషన్ సభ్యులకూ తమ కృతజ్ఞతలు తెలిపారు. డిప్యూటీ మేయర్‌గా మీర్ అహమదలీఖాన్ ఎన్నికైనారు.

ఇట్లా మేయర్ పదవిలో ఒక సంవత్సరం ఉన్న తర్వాత రెండవ సంవత్సరం మేయర్ ఎన్నికకై నగరపాలకసంఘ సర్వసభ్య సమావేశం 1952 ఏప్రిల్ 16వ తేదీన జరిగింది మీర్ అహమదలీఖాన్ తాత్కాలిక అధ్యక్షులుగా వ్యవహరించి ఎన్నిక జరిపించారు. హనుమంతరావు పంతులుగారి వ్యక్తిత్వం దృష్ట్యా వారొనర్చిన సేవల దృష్ట్యా మళ్ళీవారే ఒక సంవత్సరంపాటు మేయర్‌గా ఉండవలెనని చెప్పి వారి పేరును ధరణీధర్ సంఘీగారు ప్రతిపాదించగా కార్పొరేటర్ భాయి రామమూర్తి నాయుడుగారు బలపరిచారు. పంతులుగారు ఏకగ్రీవంగా రెండవమారు నగరమేయర్‌గా ఎన్నికైనట్లు ప్రకటింపబడింది.

మూడవసారి మేయర్ ఎన్నికకై నగరపాలక సంఘ సభ్యుల సమావేశం 1953 ఏప్రిల్ 15వ తేదీన జరిగింది. మీర్ అహమదలీఖాన్ గారు తాత్కాలిక అధ్యక్షులుగావుండి మేయర్ ఎన్నిక జరిపించారు. పంతులుగారి సేవలు నగరపాలక సంఘానికి మరికొంతకాలం అవసరం అంటూ ధరణీధర్ సంఘీగారు మేయర్ పదవికి హనుమంతరావుగారి పేరును ప్రతిపాదించగా, రామ్‌నివాస్ శర్మ తదితరులు బలపరిచారు. పంతులుగారు ఏకగ్రీవంగా ఎన్నికైనట్లు ప్రకటింపబడింది.

ఈవిధంగా హైదరాబాదు నగరపాలక సంఘానికి మేయర్‌గా మాడపాటి హనుమంతరావుగారు 1951-52, 1952-53, 1953-54 సంవత్సరాలకు వరుసగా మూడు సంవత్సరాలు ఏకగ్రీవంగా ఎన్నుకోబడి పని చేశారు.

అదేకాలంలో సికింద్రాబాదు నగరపాలక సంఘానికి వాసుదేవ మొదలియార్, డా. వి. ఎన్. తిమ్మరాజు, బి. వి. గురుమూర్తిగారలు మేయర్లుగా పని చేశారు.

హనుమంతరావుగారు హైదరాబాదు నగర మేయర్‌గా ఉన్న కాలంలో కొన్ని సత్సంప్రదాయాలు నెలకొల్పారు. పౌరుల కష్టనిష్ఠురాలను తెలిసికొని వాటిని తీర్చేందుకై గ్రీవెన్సెన్ కమిటీ అనే సంఘాన్ని ఏర్పాటుచేశారు. నగరంలోని గ్రంథాలయాలకు ధనసహాయం సరిగా అందేట్టు చూచేవారు. ప్రాథమిక పాఠశాలల్లో బాలబాలికల సాంఘిక విద్యాభివృద్ధిని ప్రణాళికాబద్ధంగా ఏర్పాటుచేశారు. నగరానికి వచ్చే ప్రముఖులకు సమర్పించే పౌరసన్మాన పత్రాలు తెలుగుభాషలోనే రచింపబడేట్టుచేశారు. నగర పారిశుధ్యం, సభ్య పౌరజీవనం విషయంలో శ్రద్ధ వహించారు.

1952 లో హైదరాబాదు రాష్ట్ర శాసనసభకు సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. కాని హనుమంతరావుగారికి హైదరాబాదు నగరంలో ఏదో ఒక నియోజకవర్గం నుంచి పోటీచేసే అవకాశమివ్వకుండా, కమ్యూనిస్టుల ప్రాబల్యంగల గజ్వేల్ నియోజకవర్గంలో వారిని కాంగ్రెసు పార్టీ నిలబెట్టడంవల్ల వారు ఓడిపోవడం జరిగింది. ఇది పార్టీ ఓటమి.



హైదరాబాదునగర మేయర్

శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు



శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయంలో ప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి చిత్రాన్ని ఆవిష్కరిస్తున్న పంతులుగారు. చిత్రంలో ఎడమ పక్కనుంచి ఉన్నవారు శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి, శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మ, శ్రీ ప తులుగారు. డా॥ బి. రామరాజు, శ్రీ ఆదిరాజు వీరభద్రరావు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారలు.



శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ఆంధ్ర పితామహుని చిత్రపటాన్ని ఆవిష్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు.

# ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు అధ్యక్షపదవి

మాడపాటి హనుమంతరావుగారు ఆంధ్రప్రదేశ్ విధానపరిషత్తుకు (ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్) ఆరేండ్లపాటు అధ్యక్షులుగా ఉన్నారు. విధానపరిషత్తు మొదటి అధ్యక్షులు వీరే.

ఆంధ్రప్రదేశ్‌కు మొదటిసారిగా 1958 జూలై 1వ తేదీన విధాన పరిషత్తు ఏర్పడింది. దీనిని శాసనమండలి అని, పెద్దసభ (అప్పర్ హౌస్) అని కూడా వ్యవహరిస్తారు. అంతకుముందు ఆంధ్ర రాష్ట్రానికి శాసనసభ ఒక్కటిమాత్రమే ఉండేది. శాసనమండలి లేదు. 1958 జూలై 7వ తేదీ సాయంకాలం భారత రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ విధానపరిషత్తుకు ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్రపతి ఆదేశానుసారం నామినేటెడ్ సభ్యులతోసహా 90 మంది సభ్యులతో ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు ఏర్పాటు చేయబడింది.

హనుమంతరావుగారు ఆంధ్రప్రదేశ్ విధానపరిషత్తుకు శాసనసభ నియోజకవర్గంనుంచి మొదట 1958 లో ఎన్నికైనారు. అది రెండేళ్ళ టరమ్. ఆ తరువాత మళ్ళీ శాసనసభ నియోజకవర్గంనుంచి 1960 లో ఎన్నికై 1966 జూలై వరకు విధానపరిషత్తు సభ్యులుగా ఉన్నారు. పరిషత్తు సభ్యులుగా వీరు కాంగ్రెసుపార్టీకి చెందినవారు.

అధ్యక్షుని ఎన్నుకోవడానికై విధానపరిషత్తు సమావేశం 1958 జులై 7వ తేదీన జరిగింది. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తాత్కాలిక

అధ్యక్షులుగా ఉండి అధ్యక్షపదవికి ఎన్నిక జరిపించారు. హనుమంత రావుగారి నామినేషన్ ఒక్కటి మాత్రమే దాఖలు అయినందువల్ల వారు ఏకగ్రీవంగా ఏన్నుకోబడినట్లు ప్రకటిస్తూ "ఆంధ్ర పితామహులు ఈనాటి వారుకారు. వారు తెలంగాణాలో ప్రప్రథమంగా గ్రంథాలయోద్యమాన్ని చేపట్టి, ఊరూరా తిరిగి గ్రంథాలయాలు, పఠన మందిరాలు, రైతు సంఘాలు, మహిళాసంఘాలు, వర్తకసంఘాలు స్థాపించి, అన్ని రంగా లతో కృషిచేసి, ప్రజలలో నిద్రాణమైఉన్న ఆంధ్రత్వాన్ని ఏకీభావం లోకి తీసుకువచ్చి కేంద్రీకరించి దానిశక్తిని ప్రజ్వలింపజేసి, ఆంధ్రోద్య మానికి స్వరాజ్య ఉద్యమానికి అది ఉపయోగపడేటట్లు చేసినటువంటి నిర్మాణ కార్యనిపుణులువారు. అట్టి ఆంధ్ర పితామహుడు ఆంధ్రకు తెలంగాణాకు సేతునిర్మాత అని నేను అభినందించిన అతిశయోక్తి కాదనుకుంటాను. అట్టివారు ఈసభకు అధ్యక్షులుగా దొరకడం మన భాగ్యమని తలుస్తున్నాను. అట్టివారి ఆధ్వర్యాన అభ్యుదయ సంస్క రణలను, శాసన నిర్మాణమును మనముచేసి, మన ప్రభుత్వాన్ని మన దేశాన్ని పటిష్ఠమైనదిగా చేసుకొనే భాగ్యము ఈసభకు కలుగుగాక అని కోరుతూ ఆంధ్ర పితామహుని పద్మభూషణుని ఈ స్థానమును స్వీకరించ వలసినదిగా కోరుతున్నాను. వారిని ఈ స్థానమునకు తీసుకు రావలసి నదిగా ముఖ్యమంత్రిగారిని, సభానాయకుని, ప్రతిపక్ష నాయకుని ప్రార్థి స్తున్నాను" అని గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అన్నారు.

అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, కమ్యూనిస్టుపార్టీ నాయకులు మఖ్దూం మొహియుద్దీన్‌గారు (వీరు ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు. ఉర్దూలో గొప్పకవి) హనుమంతరావు పంతులు గారిని సభావేదికకు తీసుకొని వెళ్ళగా వారు అధ్యక్షస్థానంలో ఆసీను లయ్యారు. పంతులుగారు వారి 74 వ ఏట ఈ సభాధ్యక్షపదవిని అలంకరించారు.

అంతట రాష్ట్ర ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు మాట్లాడుతూ "మీకు ఈనాడు ఈ గౌరవస్థానాన్ని ఇచ్చాము అనేదానికన్న ఈపదవిని మీరు అంగీకరించడంవల్ల ఈసభకే మీరు గౌరవాన్ని చేకూర్చారు. ఆంధ్రదేశానికి 40 సంవత్సరాలనుండి మీరుచేసిన సేవకు చిహ్నంగా ఆంధ్రదేశం ఈవిధంగా ఋణం తీర్చుకొంటున్నది—మీరువేసిన పునాదుల మీదనే దేశం ఈ స్థితికి రాగలిగింది— ఈ పదవి కావాలని మీరు ఎప్పుడూ కోరలేదు— అదే మీలోఉన్న గొప్పగుణము—ఆంధ్రపితామహ, పద్మభూషణలాంటి ఎన్నో గొప్పగౌరవములు మీకింతకు ముందే లభ్యమైనవి. మిమ్ములను ప్రత్యేకంగా సభ తరపున సభానాయకుడుగా నేను అభినందిస్తున్నాను" అన్నారు.

ప్రతిపక్ష నాయకుడు మఖ్దూం మొహియుద్దీన్‌గారు మాట్లాడుతూ "ఇది మన రాష్ట్రచరిత్రతో, ఆంధ్ర ప్రజల చరిత్రలో గొప్పసన్నివేశం. మొదటిసారిగా ఈ సభ ఏర్పాటు చేయబడింది. మీరు ఏకగ్రీవంగా సభాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. మీరు తెలంగాణా ప్రజల హృదయాలను వెలిగించారు. గ్రంథాలయోద్యమాన్ని, స్త్రీవిద్యను ప్రోత్సహించారు. వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపారు. మీ ఈకృషివల్ల ప్రజలు సాహసోపేతులై 1938 లో నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడి బాధ్యతాయుత ప్రభుత్వం కోరారు. మీరీ ఉద్యమాలన్నిటికీ ఆద్యులు. మీరు ఆంధ్రమహాసభను ఏర్పాటుచేశారు- తెలుగు ప్రజల ఐక్యతను సాధించారు. ఒకానొక అంధయుగంలో మీరు త్యాగంచేసి పోరాటాలు సల్పి సామాన్య మానవుని శ్రేయస్సుకు పూనుకొన్నారు. మీరు ఆ కాలంలో ఒక్క తెలంగాణాకేకాక మొత్తం హైదరాబాదురాష్ట్ర ప్రజల అభ్యున్నతికి పాటుపడ్డారు. మీ ఉన్నతాదర్శాలతో త్యాగాలతో ఏ ఒక్కపార్టీ అభిమానాన్ని మాత్రమేకాక యావదాంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నారు", అని మఖ్దూంగారు ప్రస్తుతించారు.

ఆంధ్రప్రదేశ్ సోదరీమణుల తరపున తాము పంతులుగారికి ధన్యవాదములు తెలుపుతున్నామని కడప రామసుబ్బమ్మగారు అన్నారు.

ఉపాధ్యాయ నియోజకవర్గానికి చెందిన ప్రఖ్యాత కవి కాళోజీ నారాయణరావుగారు పంతులుగారిని అభినందిస్తూ పంతులుగారు ఏసభకు అధ్యక్షత వహించినప్పటికీ, సభలో పాల్గొన్నవారందరి మర్యాదను పాటిస్తూ మార్గదర్శకులుగా ఉన్నట్లుగానే ఈ సభయొక్క గౌరవాన్ని కూడా కాపాడగలరనీ, ఈ అధ్యక్షపీఠానికి వారివంటి గొప్ప వ్యక్తి ఏకగ్రీవంగా ఎన్నిక కావడం దేశం అదృష్టమని అన్నారు.

పంతులుగారి సేవలను, గుణగణాలను ప్రశంసిస్తూ మరి కొందరు పరిషత్తు గౌరవ సభ్యులు అహమహమికతో ఎంతో ఉత్సాహంతో చక్కగా ప్రసంగించారు.

పంతులుగారు ఈ అభినందనలకు సమాధానమిస్తూ "మిత్రులు తెలిపినట్లు నేను వయోవృద్ధుడనే. నాకు 74వ సంవత్సరం వచ్చినది. "నిరస్తే పాదపే దేశే హేరండో ద్రుమాయతే" అన్నట్లు ప్రజలలో అభ్యున్నతి లేనప్పుడు, బానిసత్వం ఉన్నప్పుడు, రాజకీయం అనేమాట ఎత్తడానికే వీలులేకుండా ఉన్నప్పుడు, గ్రంథాలయాలు స్థాపించడమే మహాదోషంగా ఎంచబడే రోజుల్లో, ఆ కాలంలో ఏదో కొద్దిగా పని చేసి నందువల్ల ఈనాడు నాకీగౌరవం లభించినది. ఒక ఉర్దూ కవి చెప్పినట్లు శత్రువుకంటె మంచి స్నేహితుడు ఎవరూలేరు. అతను మనలోని లోప ములను ఎత్తి చూపిస్తూ ఉండడమువలన మనము వాటిని సరిదిద్దడానికి వీలు కలుగుతున్నది" అంటూ అందరికీ కృతజ్ఞతలు చెప్పి ప్రతిపక్ష సభ్యుల పాత్రను శ్లాఘించారు,

శాసన పరిషత్తు అధ్యక్షులుగా పంతులుగారు మూర్తీభవించిన శాంతమై కన్పించేవారు. సభలోని అందరి గౌరవాభిమానాలను పొందు

చూరగొన్నారు. సభ్యులను ఎంతో వినయంతో కలుసుకొనేవారు. వారి పట్ల ఆప్యాయత చూపేవారు. సభానిర్వహణలో ఏమాత్రం ఒడుదుడుకులు ఉండేవికావు. వారి కాలంలో సభ ఎట్టి అలజడిలేక శాంతంగా సాగేది. నిష్పక్షపాతంగా వ్యవహరించడంతేదు. సీరియస్ సమస్యలు వచ్చినా సభసాఫీగానే సాగిపోతూండేది. ఒకరికి వార్నింగ్ ఇవ్వడం లేదు. సభకు అధ్యక్షులు రాకపోవడమంటూలేదు. వారు ఒకవేళ సభ విడిచి పెట్టి వెళ్ళినా చేంబర్‌లో కూర్చొని సభా కార్యక్రమాలు వినేవారు. మళ్ళీవచ్చి సభకు అధ్యక్షత వహించేవారు. అవసరాన్నిబట్టి సభా కార్యక్రమాన్ని చకచకా నడిపించేవారు. సభలో ఎంతో కార్యక్రమం జరగ వలసి ఉండడంచేత అనేకమంది సభ్యులు సమయం అడిగితే లేదని నిరాకరింపవలసి వచ్చేది. బెల్ రింగ్ చేసి తొందర పెట్టి ప్రసంగంచే సే వారిని ఆపుచేయించేవారు. అలా తొందర పెట్టడం వారికి అయిష్టంగానే ఉండేది. అందుకువారు విచారపడేవారు. ఒకవేళ ఏ సభ్యుడైనా రూలింగ్ ఇవ్వవలసిందిగా పట్టుపట్టితే ఇస్తాము అంటూ సభా కార్యక్రమం ఆగకుండా నడిపించేవారు. స్పర్థలు, వాగ్వివాదాలు అతిగాసాగడం తమకు ఇష్టంలేనట్లు వారు కన్పించేవారు. ఎప్పుడైనా ఎవరో ఒక ప్రతిపక్ష సభ్యులు వీరిపై ప్రభుత్వంవారిని మందలించనైనాలేదే అంటూ మృదువైన నిందవేసేవారుతప్ప, పక్షపాతం చూపిస్తున్నారనిగాని, ప్రభుత్వ అనుకూల వైఖరి కనపరుస్తున్నారనిగాని ఆరోపణలు చేయలేదు. "అయ్యా, మీ ఏకగ్రీవ ఎన్నికను మేమూ ఆమోదించాము. మా విమర్శలను మీరు గుర్తుపెట్టుకొని ప్రభుత్వ పక్షంవారిని గట్టిగా మందలించాలి" అన్న ధోరణిలో విజ్ఞప్తిచేసేవారు. ప్రభుత్వాన్ని వీరు గట్టిగా మందలించకపోయినా ప్రతిపక్ష సభ్యులకు ప్రజల సమస్యలను సభ ముందుంచేందుకు తగిన అవకాశం ఇచ్చారు. ఎవరిమనస్సూ నొప్పించేవారుకాదు. వీరి అధ్యక్షతన సభ గడబిడలేకుండా నిశ్శబ్దంగా సాగిందని

పలువురు సభ్యులు అంగీకరించారు. అందుకు పంతులుగారు "బహుశా ఇది ఎల్డర్స్‌సభ అనిపించుకొన్నందున నావలెనే ఎల్డర్స్ (వయస్సులో పెద్దలు) ఎక్కువమందివుండి దీనిని శాంతంగా జరిపి ఉన్నారని భావిస్తున్నాను" అని అనే వారు చమత్కారంగా. పంతులుగారు శాసన పరిషత్తు సభ్యులయెడ చూపిన ఆదరణ అభిమానం ఎవరూ మరువలేదు. తమకంటె చిన్నవారిని సంబోధించడంలో ఎంతో మర్యాదచూపేవారు. పార్టీతో, రాజకీయాలతో నిమిత్తంలేకుండా అందరినీ సమాన ప్రతిపత్తితో గౌరవించడం వీరి ప్రత్యేకతగా ఉండేది. సభాకార్యక్రమంలో ఏదైనా ఇంటరప్షన్‌వస్తే (ఆటంకపరచడం) 'నెక్స్ట్ సబ్జెక్టు' అని ముందుకు సాగి వెళ్ళేవారు. కౌన్సిల్‌ను చాలా గొప్పగా హుందాగా పక్షపాత రహితంగా నడిపారనే పేరుప్రతిష్ఠలు పంతులుగారు సంపాదించారు. "ఏమాత్రం గందరగోళం లేకుండా శాంతియుతంగా పంతులుగారు సమావేశాలు నడుపుతున్నారు" అని ఒకమారు ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు అన్నారు.

హనుమంతరావు పంతులుగారు 1958 జూలై 7వ తేదీన విధాన పరిషత్తు అధ్యక్షులుగా ఎన్నికై 1964 వరకు — అనగా మొత్తం ఆరేండ్లపాటు ఆ పదవిలో ఉన్నారు. ఈ మధ్యలో 1960 జూలై 11వ తేదీన వీరు విధానపరిషత్తు అధ్యక్షులుగా మరొకమారు ఏకగ్రీవంగాఎన్నికయ్యారు. పరిషత్తు సభ్యులుగా వీరి రెండేళ్ళ టర్మ్ అయిపోవడంవల్ల మళ్ళీ అధ్యక్షపదవికి ఎన్నుకోబడవలసి వచ్చింది. అప్పుడు డి. సంజీవయ్యగారు ముఖ్యమంత్రి. పంతులుగారు 1964 జూలై 20 తేదీన విధానపరిషత్తు అధ్యక్షపదవికి రాజీనామాచేశారు. అయితే వారి పరిషత్తు సభ్యత్వం ఇంకా ఉన్నందువల్ల రెండేళ్ళపాటు—అనగా 1966 జూలై వరకూ కేవలం సభ్యులుగా ఉన్నారు.

పంతులుగారు విధానపరిషత్తు అధ్యక్షులుగా పదవీ విరమణ చేసినప్పుడు అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సభానాయకుడు అయిన కాసు బ్రహ్మానందరెడ్డిగారు పరిషత్తు వీరికి ధన్యవాదాలు తెలిపే తీర్మానాన్ని సభలో ప్రతిపాదించగా సభవారు ఏకగ్రీవంగా ఆమోదించారు. ఆ తీర్మానంలో సభాధ్యక్షులుగా వీరి ఉత్కృష్ట సేవలను కొనియాడి, ఆ ఉన్నతపదవిలో వీరు చూపిన ఉత్సాహమును, శక్తి సామర్థ్యాలను గొప్పగా ప్రశంసించి, సభ్యులయెడ అందరిపట్ల ఒకే విధంగా వీరు శ్రద్ధను, సౌజన్యాన్ని చూపి సభలో అన్నివర్గాల గౌరవాదరణములకు పాత్రులైనందుకు తమ గాఢ కృతజ్ఞతా భావమును నమోదుచేశారు.

* గమనిక : విధాన పరిషత్తులో ప్రముఖుల ప్రసంగాలను సౌలభ్యంకోసం సంక్షిప్తంచేసి ముఖ్యాంశాలనే స్వీకరించడం జరిగింది. మరికొందరి ప్రసంగాలను స్థలాభావంచేత ఉదాహరింప లేకపోయాను. ఇందుకు క్షంతవ్యుడను.

—రచయిత.

# గౌరవాలు

పదవులు, బిరుదులు ఆశించక నిరాడంబరంగా నిస్వార్థంగా, నిర్మాణాత్మకంగా దేశసేవ చేసిన హనుమంతరావు పంతులుగారికి వారి జీవితపు మలిదశలో బిరుదులు, గౌరవములు, పదవులు వాటంతట అవే వచ్చాయి. భారతప్రభుత్వంవారు వివిధ రంగాలలో గణనీయమైన కృషి చేసిన వారికి, అనన్యమైన ప్రతిభా సామర్థ్యాలు చూపినవారికి, గొప్ప వ్యక్తిత్వం కలిగివున్నవారికి ఏటా రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా బిరుదప్రదానం చేస్తారు. ఆ సంప్రదాయాన్ని అనుసరించి రాష్ట్రపతి మాడపాటి హనుమంతరావుగారికి 1955 జనవరి 26 వ తేదీన 'పద్మ భూషణ్' బిరుదు ఇచ్చారు. ఈ బిరుదమందుకొన్న తెలుగువారిలో వీరే ప్రథములు. దీనిని స్వీకరించడానికి పంతులుగారు ఆ సంవత్సరం ఢిల్లీ వెళ్ళలేకపోవడంచేత రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్‌గారు హైదరాబాదు విచ్చేసినప్పుడు 1956 జులై 5వ తేదీన బొలారంలోని రాష్ట్రపతి నిలయంలో ఆ బిరుద పతకాన్ని ప్రదానంచేశారు.

బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు రాష్ట్ర ముఖ్య మంత్రిగా ఉన్నప్పుడే హనుమంతరావుగారిని ఉస్మానియా విశ్వవిద్యాలయ శాశ్వత సెనేట్ మెంబరుగా నియమించారు.

పంతులుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యులుగా నాలుగేళ్ళు ఉన్నారు. పోలీసుచర్య తరువాత కూడా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగుభాషకు సముచిత స్థానం లభిం చడం కష్టమైంది. అప్పుడు పంతులుగారు మరికొందరు ప్రముఖులతో

కలిసి తెలుగును ఈ విశ్వవిద్యాలయంలో రెండవ భాషగా (ప్రాంతీయ భాషగా) పెట్టించడానికి కృషిచేసి విజయం సాధించారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం 1956 నవంబరు 4వ తేదీన జరిగిన కాన్వొకేషన్‌లో పంతులుగారికి గౌరవ డి. లిట్. (డాక్టర్ ఆఫ్ లిటరేచర్) పట్టప్రదానంచేసి గౌరవించింది. అప్పుడు ఈ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ప్రముఖ విజ్ఞాన శాస్త్రవేత్త డా॥ సూరిభగవంతం గారున్నారు. వారు డి. లిట్. పట్టాన్ని పంతులుగారికి ప్రదానం చేయవలసిందిగా విశ్వవిద్యాలయ ఛాన్సలర్‌కు విన్నవిస్తూ పంతులుగారు రాష్ట్రానికీ, ముఖ్యంగా విద్యారంగానికీ ఉస్మానియా విశ్వవిద్యాలయానికీ చేసిన సేవల ప్రశంసచేసి, "హైదరాబాదుకు చెందిన ఈ వృద్ధమనీషి ఎల్లప్పుడూ నిరాడంబర జీవితానికి ఉన్నతాదర్శాలకూ ఉదాహరణప్రాయంగా జీవనం గడపి, ప్రజలకు తన సర్వస్వమూ అర్పించుకోవడమేగాని, వారినుండి తనకేమీ పొందనట్టి నిస్వార్థజీవి" అని ప్రస్తుతించారు.

# కుటుంబం

హనుమంతరావుగారు చదువు పూర్తి అయిన కొద్దికాలానికే 1904 లో తమ చిన మేనమామగారి కుమార్తె అన్నపూర్ణమ్మను వివాహ మాడారు. హనుమకొండలో చిన్న ఉద్యోగంలో ఉన్నప్పటికీ భార్యను తెచ్చుకొని కాపురం పెట్టడమే కాక, మేనత్తను కూడా తమతోపాటే ఉండమనిచెప్పి ఆమెను ఆదరించారు. అన్నపూర్ణమ్మగారివల్ల వీరికి ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు లక్ష్మీబాయి. ఆ తర్వాత కొద్దికాలానికే అన్నపూర్ణమ్మగారు యౌవనదశలోనే అకాలమృత్యువుకు లోనుకాగా, ఆ తల్లిలేని బిడ్డను హనుమంతరావుగారి అన్నగారైన తిరుమలరావుగారు వారి భార్యగారు గారాబంగా పెంచి పెద్దదానిని చేశారు. లక్ష్మీబాయి గుంటూరులో వకీలైన గోవిందరాజుల దత్తాత్రేయగారిని వివాహమాడారు.

తిరుమలరావుగారు ఎర్రుపాలెం కాపురస్థులై వకీలు వృత్తి చేస్తూ ప్రజా జీవితంలోకూడా పాల్గొన్నారు. ఆంధ్రోద్యమం ప్రారంభదశలో వారు ఆంధ్రజనసంఘం మూడవ కేంద్ర సంఘ సమావేశానికీ, ఆంధ్ర గ్రంథాలయ ప్రథమ మహాసభకూ ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వుండి ఆ సభలను జయప్రదంగా జరిపించారు. వారి కుమారుడు మాడపాటి రామచంద్రరావుగారు మేధావి. ఆయన న్యాయశాస్త్రంలో పట్టభద్రులై సినిమారంగంలో సహాయదర్శకులుగా పనిచేశారు. ఆ తర్వాత రామ చంద్రరావుగారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొని స్వామి రామానందతీర్థ అధ్యక్షులుగా ఉండగా స్టేట్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. నిజాంకు వ్యతిరేకంగా సాగిన స్టేట్ కాంగ్రెసు సరిహద్దు పోరాటంలో రామచంద్రరావుగారు స్టేట్ కాంగ్రెస్ కార్యాచరణ



మాడపాటి హనుమంతరావు దంపతులు, వారి కుమారుడు చి॥ సుకుమార్.



హనుమంతరావు దంపతులు, కుమారుడు చి॥ సుకుమార్, కోడలు శ్రీమతి సుచేత



మాడపాటి హనుమంతరావు పంతులుగారి కుమారుడు మాడపాటి సుకుమార్,
కోడలు శ్రీమతి సుచేత.

సంఘం సభ్యులుగా పనిచేశారు. ఆ సరిహద్దు పోరాటంలో రామచంద్ర రావుగారి కుమారులైన మాడపాటి వినయకుమార్ ఈ రచయితతోపాటు బెజవాడ శిబిరంలో పనిచేశారు. రామచంద్రరావుగారి ఉన్నత విద్య విషయంలో హనుమంతరావు పంతులుగారు శ్రద్ధ తీసుకొనారు. తిరుమలరావుగారు 1936 లో స్వర్గస్థులైనారు.

భార్య అన్నపూర్ణమ్మగారు చనిపోయిన తర్వాత హనుమంతరావు పంతులుగారు 1918 లో గోళ్ళమూడి హనుమంతరావుగారి కుమార్తె మాణిక్యమ్మగారిని వివాహం చేసుకున్నారు. తాము నెలకొల్పిన బాలికల ఉన్నత పాఠశాలలో మాణిక్యమ్మగారిని విద్యార్థినిగా చేర్చి, తాము స్వయంగా ఆమెకు చదువుచెప్పి ప్రవేశ పరీక్షకు కూర్చోబెట్టగా ఆమె ఉత్తీర్ణురాలై తెలుగు ఇంగ్లీషు భాషలలో మంచి పరిజ్ఞానం సంపాదించారు. మాణిక్యమ్మగారు కూడా ప్రజాసేవారంగంలో భర్తనుఅనుసరించి సిరిసిల్లలో 1935 లో నాల్గవ ఆంధ్రమహాసభతో పాటుగా జరిగిన ఆంధ్ర మహిళాసభకు అధ్యక్షత వహించి, నారీలోకం ఆదరాభిమానాలకు పాత్రులైనారు. మాణిక్యమ్మగారివల్ల హనుమంతరావు పంతులుగారికి ఒక కుమారుడు కలిగాడు. ఆయనపేరు సుకుమార్. సుకుమార్ పట్టభద్రుడై గెజిటెడ్ ఆఫీసర్ ఉద్యోగంలో చేరి 1964 లో సుచేత అను విద్యావతిని వివాహం చేసుకొన్నారు. ఎంతో పైకి రావలసిన సుకుమార్ తండ్రిగారి మరణానంతరం అకాలమరణం చెందారు. శ్రీమతి సుచేత మాడపాటి హనుమంతరావు బాలికల ఉన్నతపాఠశాలకు తమ సేవలను అర్పితం చేశారు.

# మిత్రుడు, మార్గదర్శి, ఆదర్శప్రాయుడు

ప్రజాహితకార్యదీక్షాపరులైన పంతులుగారిలో అందుకు అవసరమైన సౌజన్య గుణవిశేషాలు ఉండటం తెలంగాణా ప్రజల అదృష్టవిశేషమని చెప్పాలి. వీరు ఎల్లప్పుడూ నిరాడంబర జీవితం గడిపారు. శ్రమకు ఎన్నడూ వెనుదీయలేదు. నిరంతరకృషీవలుడీయన. అవిరళ సేవ ఈయనది. వీరి నిత్యజీవితంలో ప్రజాహితకార్యాలు ప్రధానస్థానమాక్రమించి ఉండేవి. నియమబద్ధులై నిరంతరము శ్రమించి ఫలితాలను బేరీజువేసుకొన్న సేవాదురీణుడు. వీరి సౌలభ్యము, మార్దవము, హృదయకోమలత్వం అందరినీ ఆకర్షించేవి. వీరి విజ్ఞానతృష్ణ యువకులకు ఆదర్శప్రాయంగా ఉండేది. విద్యావినోదిగా వీరు పేరుపడ్డారు. శాంతిప్రియులు, వినయభూషణులు; సర్వసమవర్తి. ప్రజాజీవితంలో ఉదారులను, సమర్థులను గుర్తించి వారితో మైత్రి నెరపడంలో, వారి సేవలను ఇతోధికంగా ప్రజలకు లభింపజేయడంలో వీరు చూపిన బుద్ధికౌశలము దానికదేసాటి. రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు నిజాం ప్రభువును సేవిస్తూకూడా స్వజాతి అభ్యుదయానికీ, దాని సంస్కృతి వికాసానికీ పాటుపడే వ్యక్తులకూ సంస్థలకూ చేయూతనిచ్చి, అటు పాలకులకు విశ్వాసపాత్రుడై, ఇటు ప్రజల ప్రేమాభిమానాలకు పాత్రుడైన విజ్ఞతాసంపన్నుడు. నిజాం రాష్ట్రంలో ఆంధ్రులకాయన చేసినమేలు ఇంతని వర్ణించిచెప్పనలవికానిది. హనుమంతరావు పంతులుగారు అంతటి మహావ్యక్తితో మైత్రినికాంక్షించారు. తాముస్థాపించిన బాలికోన్నత పాఠశాలకు వారిని అధ్యక్షులుగా చేసుకొని ఆ సంస్థ మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లేటట్టు వారి అధ్వర్యాన సంస్థ అభివృద్ధికి పాటుపడ్డారు.

సురవరం ప్రతాపరెడ్డిగారు రచించిన రాజాబహద్దరు జీవితచరిత్రకు పంతులుగారు నివేదనవ్రాస్తూ వ్రాసిన మాటలు ఇచట స్మరణీయమైనవి: "శ్రీ రాజాబహద్దరువారి సేవాసక్తి ఔదార్యమును మేమీ విజ్ఞప్తియందు ఎక్కువగా ప్రస్తావించదలచలేదు. తలచినను అది సాధ్యముకాదు. ఈ నిజాం రాష్ట్రములో 50 సంవత్సరములకంటె ఎక్కువకాలమునుండి ప్రభుసేవయొనర్చుచు, దాదాపుగా నీకాలమంతయు పోలీసు ఉద్యోగమున గడపియు, జాతిమతభేదములగాని, సంపన్నులు పేదలు అను తారతమ్యమునుగాని గమనించక ఆబాలగోపాలము అందరి మన్ననలకు పాత్రులై, చేతనైన ఉపకారము అడిగినను అడుగకపోయినను ప్రతి వారికి చేయు జీవనమును ధన్యముగా గడపుచున్న శ్రీ రాజాబహద్దరు రెడ్డిగారు నిజాము రాష్ట్రములోని ప్రతివ్యక్తికిని ఆదర్శప్రాయులు" అని కీర్తించారు. రాజాబహద్దరు వారి పరోపకారపారీణతను, విద్యాపోషణమును దేశసేవను పంతులుగారు తరచు ప్రస్తావించడమేగాక, వాటిని వారు మరింతగా ఉపయోగించుకొని, అంతటి స్త్రీ విద్యాభిమాని పేర హైదరాబాదు నగరంలో స్త్రీల కళాశాల ఒకటి ఉండటం అవసరమని భావించి అట్టి కళాశాల ఏర్పాటుకు కృషిచేసి దానిని సాధింపగలిగారు. రాజాబహద్దరు వారికి హనుమంతరావు పంతులుగారిపై ప్రత్యేక గౌరవభావం ఉండేది. వీరి ఉభయుల పరస్పర సహకారం తెలంగాణా ప్రజలకు ఎంతైనామేలు చేసింది.

హనుమంతరావుగారి సన్నిహితులలో సురవరం ప్రతాపరెడ్డిగారు ఒకరు. వీరిద్దరూ ఒకరికొకరు ఆప్తులు. రెడ్డిగారి అధ్యయనం, పాండిత్యం, రచనా కౌశలముపై పంతులుగారికి ఎనలేని అభిమానం, గౌరవం ఉండేవి. పంతులుగారి నాయకత్వాన్ని రెడ్డిగారు సర్వవేళలా ఆమోదించి వారిని అనుసరించారు. హనుమంతరావుగారు ప్రప్రథమంగా 1925 లో ప్రతాపరెడ్డిగారిని దర్శించి పరిచయంచేసుకొన్నారు. అప్పటికి

రెడ్డిగారు రెడ్డిజనసంఘ కార్యదర్శిగా రాజాబహద్దరు వెంకటరామారెడ్డి గారి అభిమతమునకనుసరించి పనిచేస్తూఉన్నారు. పంతులుగారు శ్రీ కృష్ణ దేవరాయాంధ్రభాషా నిలయంలో సభ ఏర్పాటు చేయించి ప్రతాపరెడ్డి గారిచే 'నిజాంరాష్ట్రాంధ్రులు' అనే విషయంపై ఉపన్యాసమిప్పించారు. ఉపన్యాసం ముగిసిన తర్వాత పంతులుగారు సుమారొక గంటసేపు ప్రసంగించి రెడ్డిగారి ప్రసంగమును ఎంతో ప్రశంసించారు. ఆ తర్వాత పంతులుగారు రెడ్డిగారిని క్రమంగా ప్రజా వ్యవహారాలలోకి తీసుకొచ్చి తాము ఆరంభించిన ఆంధ్రోద్యమానికి చేదోడువాదోడుగానిలుపుకొన్నారు.

ప్రతాపరెడ్డిగారి జీవితచరిత్ర రచించిన ఒకరచయిత ఆ చరిత్రలో ఇట్లా తెలియజేశారు. *"ప్రతాపరెడ్డిగారి ప్రజాసేవ ప్రబోధములతో ప్రారంభమైనది. వారు రెడ్డి జనసంఘ కార్యదర్శిగా ఉన్నప్పుడు విద్యార్థులకొరకు ఉపన్యసిస్తూ ఉండేవారు. కాగితములపై క్రమబద్ధంగా వ్రాసుకొని, ఆ అంశాలనే విపులీకరించేవారు. ఆ విషయం ఆ నోటా ఆ నోటా పడి మాడపాటి హనుమంతరావుగారికి తెలిసింది. రావుగారు రెడ్డిగారిని వెతుక్కుంటూ వచ్చారు. ఆంధ్ర పితామహునిలో వున్న గొప్పతనమదియే. ఎక్కడ సామర్థ్యంకల యువకులూ, కార్యదీక్షాపరాయణులూ, సేవాస్వభావముగలవారూ గోచరించినా మాడపాటివారు తామే స్వయంగా వారివద్దకువెళ్ళి వారికి పని కల్పించి తమ ఆంధ్రోద్యమ కార్యక్రమాన్ని నిర్వహించేవారు. మాడపాటివారెన్నడూ తగుదునమ్మా యని తామే పట్టము కట్టుకొనలేదు. పనులు నిర్వహించుటలో తాము ముందుండి, పట్టము మాత్రము మరొకరికి కట్టి మురిసిపోతుండెడివారు.

---

* 'సురవరం ప్రతాపరెడ్డి–జీవితము–రచనలు'
రచన : ముద్దసాని రామిరెడ్డి,
ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

అందుకే ఆంధ్రపితామహులు అందరికీ గురుతుల్యులైనారు. ప్రతాపరెడ్డి గారికి మాడపాటివారు రాజకీయగురువు. రెడ్డిగారు అభిమానించి గౌరవించిన వ్యక్తి రాజకీయరంగంలో ఒక్క హనుమంతరావుగారే!"

అంతేకాక 'గోలకొండపత్రిక' ద్వైవారపత్రికగా వెలువడాలని మాడపాటి హనుమంతరావుగారు కూడా అభిలషించడంవల్ల వారు, ఆ పత్రిక సక్రమ ప్రచురణకు తోడ్పడవలసి వచ్చింది. ప్రతాపరెడ్డిగారికి వారు అండగా నిలిచారు, అని కూడా ఆ రచయిత తెలిపి ఉన్నారు. 1930 లో జోగిపేటలో జరిగిన మొట్టమొదటి ఆంధ్రమహాసభకు అధ్యక్షులెవరు కావాలి అన్న ప్రశ్న వచ్చినప్పుడు హనుమంతరావు పంతులుగారు సురవరం ప్రతాపరెడ్డిగారినే ఎంపిక చేశారు. ఒక గొప్ప పత్రికా సంపాదకుడు, పండితుడు, సర్వతోముఖ ప్రతిభాశాలియైన రచయిత మొదటి ఆంధ్రమహాసభకు అధ్యక్షత వహించడం, ఆ సంస్థకు శుభోదయమనే చెప్పాలి. ఆంధ్ర మహాసభలకు అధ్యక్షత వహించిన వారందరిలో ప్రతాపరెడ్డిగారే అన్నివిధాలా సమర్థులని పంతులుగారు తమ 'తెలంగాణా ఆంధ్రోద్యమం' రెండవసంపుటిలో వ్రాశారు. ఆంధ్రోద్యమానికి ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వాన 'గోలకొండపత్రిక' ఇచ్చిన చేయూత, కలిగించిన ప్రచారము అద్వితీయమైనవి. గ్రామప్రజలకు ఈ పత్రికవల్లనే ఆంధ్రమహాసభల వార్తలు తెలియవస్తూ ఉండేవి.

ఈవిధంగా హనుమంతరావుగారు ప్రజాహిత జీవనంలో ప్రవేశించినది మొదలు తమతోపాటు అనేకమంది పెద్దలను, విద్యావంతులను, దాతలను ప్రజాసేవకులుగా తయారుచేస్తూ పోయారు. ముఖ్యంగా కొండా వెంకటరంగారెడ్డిగారిని హనుమంతరావుగారే ప్రజాసేవలోకి తీసుకువచ్చారు. వెంకటరంగారెడ్డిగారు వారి 'స్వీయచరిత్ర'లో ఇట్లా

వ్రాశారు. *"శ్రీ మాడపాటి హనుమంతరావుగారు వకాలత్ ప్రారంభించిన తర్వాత తెలంగాణమువారిని కూడా ప్రజాహిత కార్యములలో ముందుకు తెచ్చుటకు, ప్రజలలో జాగృతి కలిగించవలెనని వకాలత్‌తో పాటు కృషి చేయసాగిరి. కొద్దికాలములోనే తెలంగాణములో జాగృతి వచ్చి జనులు ప్రజాహిత కార్యములలో మహారాష్ట్ర, కర్ణాటక సోదరుల కంటె ముందుకు పోయినారు. నేను నడుపుచుండిన 'లా' క్లాసు పోస్టర్ల ద్వారా నాపేరువిని శ్రీ హనుమంతరావుగారు నా దగ్గరకు వచ్చి నన్ను కూడా వకాలత్‌తోపాటు ప్రజాహిత కార్యములలో పాల్గొనవలసినదిగా పదేపదే చెప్పుచూవచ్చిరి. నేను ప్రప్రథమమున కుటుంబభారమువలన పాల్గొన నిరాకరించితిని. కాని వారు మరల మరల కోరుటవల్ల అంగీకరించి, ప్రజాహిత కార్యములలో పాల్గొన ప్రారంభించితిని."

అంతకుమునుపు హైదరాబాదు రాష్ట్రంలో ప్రజాహిత కార్యాలు చాలా తక్కువఅనీ, ఏవైనా కొద్దిగాఉంటే అవి హైదరాబాదునగరంలోనే అనీ, వాటినికూడా అడ్వకేటు పండిత కేశవరావు, జాగీర్దార్ వామన్ నాయక్ అనే మహారాష్ట్రులే నడుపుతూఉండేవారు అని కూడా రంగారెడ్డిగారు తెలిపారు. బహుశా ఈ కారణంచేతనే కాబోలు, మందుముల నరసింగరావుగారు వారు రచించిన '50 సంవత్సరాల హైదరాబాదు' అనే గ్రంథంలో మాడపాటి హనుమంతరావుగారు రెండవ తరం నాయకులన్నివ్రాశారు. ఇది నిజమే. అయితే "తెలంగాణాలో అసలు ప్రజాజీవితం వీరితో ఆరంభమైనదికావుననే నిజాంరాష్ట్ర ఆంధ్రోద్యమమునకు 'పితామహులు' అని పేరుగాంచినారు" అని పంతులుగారినిగూర్చి ప్రత్యేకంగా రచించిన ఒక పేరాలో నరసింగరావుగారు తమ అభిప్రా

* 'స్వీయచరిత్ర'— కొండా వెంకటరంగారెడ్డి;
స్వీయచరిత్ర ట్రస్టు కమిటీ; హైదరాబాదు, 1967.

యం వ్రాశారు. ప్రజా సేవను విస్తారంగా తెలంగాణా గ్రామాలలోకి తీసుకువెళ్ళినవారు హనుమంతరావు పంతులుగారే.

కొండా వెంకటరంగారెడ్డిగారి ఈ స్వీయచరిత్రకు హనుమంతరావు పంతులుగారు తొలిపలుకు వ్రాస్తూ "యధార్థమేమనగా వారికిని నాకును పూర్వపు పరిచయమేమీలేదు. నేను తెలంగాణమునకు చిట్టచివరి రైలుస్టేషనగు ఎర్రుపాలెము గ్రామకాపురస్థుడను. ఇక ఆయన హైదరాబాదు జిల్లాలోని మంగళారం గ్రామ కాపురస్థుడు. ఇట్టిస్థితిలో మా ఇద్దరకు గాఢమగు మైత్రి, పరస్పరావగాహన సంభవించి తెలంగాణములోని దాదాపు కోటిమంది ప్రజల రాజకీయ వైజ్ఞానిక సాంఘిక చైతన్యమునకు తోడ్పడగలుగుట కేవలము దైవికమని భావించుచున్నాను. నాకు ప్రభుత్వమువారివల్లను, ప్రజలవల్లను కలిగిన సమస్త గౌరవములు, బిరుదములు, పదవులు వీరియొక్క నిస్వార్థకృషి ఫలితములే" అని వ్రాశారు. అన్నీ ఏమోకాని పంతులుగారి షష్టిపూర్తిని రెడ్డిగారే పూనుకొని వైభవంగా జరిపారు. పంతులుగారిని తెలుగువారినగరమైన హైదరాబాదు నగర మేయర్ పదవికి నిలబడవలసిందనీ, విధానపరిషత్ అధ్యక్షులుగా పంతులుగారే ఉండవలెననీ రంగారెడ్డిగారు పట్టుపట్టి, వారిని ఆ రెండు పదవుల ఎన్నికకు నిల్చోమని వత్తిడిచేసి వారి విజయాన్ని రెడ్డిగారు సాధించారు. మొదటినుంచీ కొండా వెంకటరంగారెడ్డిగారంటే హనుమంతరావు పంతులుగారికి ప్రత్యేక అభిమానం ఉండేది. రెడ్డిగారి కార్యదక్షతను, ఋజువర్తనమును, వారి ఆలోచనకూ పైకి చెప్పేమాటకూ తేడా ఉండకపోవటాన్నీ పంతులుగారు ఎంతగానో ప్రశంసిస్తూ ఉండేవారు. వీరి ఇద్దరిమైత్రి ఆదర్శప్రాయమైనది. అనన్యమైనది.

హనుమంతరావుగారి ప్రభావం ప్రముఖ కమ్యూనిస్టు నాయకులైన రావి నారాయణరెడ్డిగారిపై కొంత ఉంది. "పంతులుగారు ఎంత మితవాదు

లైనప్పటికీ; ఆంధ్రోద్యమాన్ని వారెంత తాబేలునడకతో నిర్వహించిన ప్పటికీ వారిపై నాకుగల సద్భావాన్ని చెప్పకుండా ఉండలేను" అంటూ రావి నారాయణరెడ్డిగారు "నాబోటి యువకులెందరో ఆయనవల్ల ప్రభా వితులై ఆంధ్రవాఙ్మయంతో పరిచయమేర్పరచుకున్నారు. హైస్కూ లులో ఉర్దూ రెండవ భాషగా చదివిన నేను పంతులుగారిచే ప్రభావితుడ నయ్యి, కాలేజీకిరాగానే తెలుగు రెండవ భాషగా తీసుకున్నాను. తెలుగు ప్రబంధాలను చదివాను. తెలుగులో ఉపన్యాసాలివ్వడం నేర్చుకున్నాను. నాలాగే ఇంకెందరినో ప్రభావితులనుచేసిన పంతులుగారికి 'ఆంధ్రపితా మహ' అన్న బిరుదు ఆయనపట్ల సార్థకతను సంతరించుకొన్నది" అని వారి అనుభవాలు, జ్ఞాపకాలు అనే పుస్తకంలో ఆంధ్రమహాసభ ప్రకర ణాన్ని ముగిస్తూ రావినారాయణరెడ్డిగారు వ్రాశారు.

అట్లాగే ఉన్నత విద్యనభ్యసించి రచనచేస్తూ, సారస్వత రం గంలో పైకిరాగలవారికికూడా హనుమంతరావు పంతులుగారు తమకై తామే చొరవతీసుకొని ప్రోత్సహించారు. ఆంధ్రసారస్వత పరిషత్తుకు అధ్యక్షులుగా పనిచేసి, కొంతకాలం రాజ్యసభ సభ్యులుగా ఉండి, ఉస్మా నియా విశ్వవిద్యాలయానికి ఆక్టింగ్ వైస్ ఛాన్సలర్‌గాకూడా పనిచేసి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులుగా నియమితులై, ఆంధ్ర పదేశ్ సాహిత్యరంగంలో ప్రముఖులుగా పరిగణింపబడేటువంటి దేవుల పల్లి రామానుజరావుగారు స్వీయచరిత్రవంటి వారిపుస్తకంలో ఇట్లా వ్రాశారు.* "నా మొట్టమొదటి వ్యాసము పత్రికలో ప్రకటితమైంది. ఎంతోసంతోషం కలిగింది. రెండు రోజుల తరువాత సన్నని దస్తూరీతో 'మిత్రవర్యా' అని సంబోధిస్తూ వ్రాసిన కార్డు ఒకటి అందింది. ఆ కార్డు

* 'యాభై సంవత్సరాల జ్ఞాపకాలు' — దేవులపల్లి రామానుజరావు, సాహితీ బంధుబృందం—చైతన్యసాహితి, హనుమకొండ ప్రచురణ – 1981.

హైదరాబాదు రాష్ట్రంలోని సమస్త ప్రజాహితజీవనానికి, సాంస్కృతిక కార్యకలాపాలకు అన్నింటికీ మార్గదర్శకులైన మూలవిరాట్టు ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు వ్రాసింది. వారి ప్రశంస నన్ను పరమానందభరితుణ్ణిచేసి, సాహిత్యరంగంలో కృషి చేయవలెననే సంకల్పము రేకెత్తించింది. వ్యాసాన్ని హర్షిస్తూ హైదరాబాదు వచ్చినప్పుడు తమను తప్పక కలుసుకోవలసిందిగా పంతులుగారు నన్ను ఆ కార్డులో కోరినారు. అంతటి మహావ్యక్తి కోరికను ఆదేశంగా భావించి తరువాత కొన్ని వారాలకు హైదరాబాదువచ్చి వారిని సందర్శించినాను. ఆనాడు వారు నాపట్లచూపిన ఆదరము, నాకు ఇచ్చిన ప్రోత్సాహము నా జీవితంలో ఎన్నడూ మరువజాలను. విద్యాధిక యువకులను ప్రజాసేవవైపు ఆకర్షించడం పంతులుగారి ఆశయాలలో ఒకటి. ఎందరో యువకులు వారి ప్రోత్సాహంతో దేశసేవ భాషాసేవ చేసినారు" అని వ్రాశారు. అంతేకాక "పంతులుగారు తెలంగాణా వైతాళికులు తరువాత తీవ్ర రాజకీయాలకు దూరంగా ఉన్నా చివరవరకు అన్ని జాతీయోద్యమాలను, సాంస్కృతికోద్యమాలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ప్రోత్సహించి అండగా నిలిచిన దేశాభిమానులు" అని కూడా పంతు
రామానుజారావుగారు కీర్తించారు. ఇట్లా చెబుతూ పోవాలంటే
ఉదాహరణలున్నాయి. ఎక్కడ ప్రతిభ కన్పించినా నిండారా
షించి ప్రోత్సహించిన సహృదయులు హనుమంతరావు పంతులు.



ఆయనది నిండు విగ్రహం. ఆయన సౌమ్యభాషి. ఎంతటి మహనాయకుడో అంతటి నిగర్వి. సమదర్శి. నయబోధకుడు. ఆరాటం లేని గుండెదిటవు కలవాడు. నిరంకుశత్వాన్ని ఎదిరించినా సౌమ్యంగా ఎదిరించారు. ఏ కార్యరంగంలోనైనా యువకులున్నారా లేరా అని చూచేవారు. ఆయన యువకులలో యువకుడు. యువతరంవారి నిర్మాణాత్మక కృషినిచూచి ఆనందించేవారు. ఉత్తమ అభిరుచులుగల సంస్కారి.

ఆయన కున్నటువంటి క్రమశిక్షణ అందరికీ ఆదర్శప్రాయమైనది. సమయపాలనలోనూ ఆయన ఇతరులకు ఒరవడి పెట్టారు. ప్రజాసంస్థల డబ్బును వినియోగించడంలో ఆయన చూపిన నీతి, నిగ్రహం గొప్పవి. ప్రతిపైసా లెక్కించి ఖర్చుపెట్టేవారు. ఒక ఆంధ్రమహాసభ జరిగిందంటే దానికి వచ్చిన ఆదాయం, అయిన వ్యయం లెక్కలు సక్రమంగా ఉండవలసిందే. ఆ విషయంలో ఆయన కఠినమైన నియమాలను పాటించేవారు. కాబట్టే ఆయన పట్టిందల్లా బంగారమైంది. ప్రజాసంస్థలకు సుస్థిరమైన పునాదులు వేయగలిగారు. ఓపినంతవరకూ దీపాలు వెలిగించారు. తెలంగాణా సర్వతోముఖ వికాసం, దాని సుఖశాంతులు కాంక్షించారు. అఖిలాంధ్రలోనేకాక దేశంలోకూడా ఒక విశిష్ట స్థానాన్ని అలంకరించి అందరి హృదయాలలోనూ చిరస్థాయిగా నిలిచిపోయిన మహావ్యక్తి. కాబట్టే తెలంగాణాకు చెందిన నవలా రచయిత దాశరథి రంగాచార్య తాము రచించిన 'చిల్లరదేవుళ్ళు' నవలలోని కథానాయకుడు పంతులుగారిని హైదరాబాదులో కలిసి మాట్లాడినట్లు రచించడమేగాక ఆ నవలను "నిజాం పరిపాలనలో ఊరూపేరూ మాసిన ఆంధ్రజాతికి ఒక తీరూ తెన్నూ కల్పించిన ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి అంకితం" అని చెబుతూ వారికి తమ నవలను అంకితమిచ్చారు.



శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంలో పంతులుగారి చిత్రపటావిష్కరణ.
ఎడమ నుంచి శ్రీ అవ్వా సత్యనారాయణరావు, డా॥ బి. రామరాజు,
శ్రీ యం. బలరామాచారి, పంతులుగారు, మాడపాటి సుకుమార్.



హైదరాబాదులో జరిగిన ఒక సాహిత్య సభలో ప్రసంగిస్తున్న శ్రీ మాడపాటి
హనుమంతరావు పంతులుగారు. చిత్రంలో కూర్చున్నవారిలో మధ్యన
డా॥ దాశరథి, చివర డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు ఉన్నారు.



హైదరాబాదు నగరంలో ఒక సభలో ఎడమ ప్రక్కనుంచి శ్రీ గోపాలరావు ఎక్బోటే,
శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ పంతులుగారు.



హైదరాబాదు నగరంలో ఒక సభలో ఉపన్యాసమిస్తున్న
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు. చిత్రంలో పంతులుగారు కూడా ఉన్నారు.



హైదరాబాదు నగరంలో ఒక సాహిత్య సభలో సమావిష్టులైన పంతులుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు, డా॥ చెన్నారెడ్డిగారు; ఉపన్యసిస్తున్నవారు శ్రీ పోతుకూచి సాంబశివరావు.



హైదరాబాద్ కేంద్ర సహకార సంఘం శ్రీ హనుమంతరావుగారికి "సహకార రత్న ఆనే బిరుదు ప్రదానం చేస్తున్న సందర్భంలో తీసిన చిత్రం. ఇందులో శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, బేగం ఫజల్‌నవాజ్ జంగ్, శ్రీ వి. హెచ్. దేశాయ్ ఉన్నారు.



హైదరాబాదు నగరంలో జరిగిన శ్రీ పొట్టి శ్రీరాములు స్మారక సభలో ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు. ఉపన్యాసమిస్తున్న వారు శ్రీ కొత్తూరు సీతయ్య గుప్తగారు.

# అస్తమయం

వృద్ధాప్యదశలో పంతులుగారు విశ్రాంతి తీసుకొంటూనే, ఎక్కడైనా సాంస్కృతిక సమావేశం జరిగితే శ్రమ అనుకోక వెళ్ళి, ఓపినంతమేరకు కార్యక్రమాలు చూచి, ప్రసంగాలు విని ఇంటికి చేరు కొనేవారు. క్రమేణా వారి ఆరోగ్యం క్షీణించింది. సుమారు ఒక సంవత్సర కాలం అస్వస్థులుగా ఉండి 1970 నవంబరు 11వ తేదీ సాయంకాలం 5-45 గ లకు హైదరాబాదు నగరంలో హనుమాన్ టేక్డీ లోని వారి స్వగృహం 'ఆంధ్రకుటీరం'లో తమ 86వ యేట కాలధర్మం చెందారు.

రాష్ట్ర గవర్నరు ఖండూభాయి దేశాయి, రాష్ట్ర ప్రభుత్వ మంత్రులు, అధికార అనధికార ప్రముఖులు వారి ఇంటికి వెళ్ళి నివాళు లర్పించారు. నవంబరు 12వ తేదీన అంబరుపేట శ్మశానవాటికలో అంత్యక్రియలు జరిగాయి. అంత్యక్రియలకు మునుపు రాష్ట్ర ప్రభుత్వం పక్షాన ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిగారు వారి భౌతికకాయంపై పుష్పగుచ్ఛం ఉంచి శ్రద్ధాంజలి ఘటించి "తెలుగుజాతి సమైక్యతకు, తెలుగు భాషావికాసానికి, తెలుగుప్రజల అభ్యుదయానికి తన జీవితాన్ని అర్పణచేసిన ఆంధ్రపితామహుని మృతి తెలుగు ప్రజ లందరికీ ఎంతో సంతాప కారణమని" అన్నారు. హైదరాబాదు మునిసిపల్ కార్పొ రేషన్ పక్షాన, వివిధ విద్యా, సాంఘిక రాజకీయసంస్థల పక్షాన పుష్ప గుచ్ఛాలు ఉంచబడ్డవి. రాష్ట్రప్రభుత్వం వీరి మృతిపట్ల సంతాప సూచ కంగా నగరంలోని ప్రభుత్వ కార్యాలయాలకు విద్యాసంస్థలకు సెలవు

ప్రకటించింది. పంతులుగారి మృతివల్ల అనిర్వచనీయమైన ఏదో వెలితి ఒకటి ఏర్పడిందని రాష్ట్రంలో అందరూ ఖిన్న హృదయులయ్యారు. ఆయన అంతిమయాత్ర మనస్సులను కదిలించివేసి కన్నీటిబొట్లతో తడిపి వేసిన ఒక గంభీరదృశ్యమనీ, జంటనగరాలు రెండూ కదిలివచ్చినట్లుగా ప్రజలు ఆ మహానాయకునికి శ్రద్ధాంజలి ఘటించారనీ ఒక పత్రికా విలేఖరి వ్రాశాడు. నందిగామతాలూకా పొక్కునూరు గ్రామం, వరంగలు, హైదరాబాదు, తెలంగాణా-సమస్తాంధ్రమూ ఆయన నిర్విరామ జీవితానికి ఆటపట్టులు. ఏమి ప్రజాహిత జీవనం! ఎంత బహుముఖ సేవ! లక్షలాది ప్రజల అభ్యున్నతికోసం ఎటువంటి కృషి జరిగింది! ఆయన కన్ను మూయడంతో హైదరాబాదులో ఒక శకం ముగిసిపోయింది. చివరకు మిగిలింది ఆంధ్ర కుటీరం. అన్ని భాషల పత్రికలు తెలుగుల మేటిబిడ్డ అయిన ఆయనకు శ్రద్ధాభక్తులతో నివాళు లర్పించాయి.'ఆంధ్ర పత్రిక' ఒక సంపాదకీయంలో ఆయన చేసిన కృషిని ప్రస్తావిస్తూ ఈ విధంగా జోహారు లర్పించింది: "ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు ఇకలేరు. వారి అస్తమయంతో తెలుగుజాతి జీవితంలోనే ఒక తీరనిలోటు ఏర్పడినట్లయింది. తెలుగుజాతి సమైక్యతకు, తెలుగుప్రజల బహుముఖ అభ్యున్నతికి తన జీవితాన్ని వినియోగించి, ఆ కృషిలో తాను కనిన కలలు ఫలించడం చూచి సంతృప్తి చెందిన ధన్యజీవి. నిజాం నిరంకుశ పాలనలో భాషా ఉద్యమాలను, గ్రంథాలయోద్యమాన్ని నిర్మించి, వాటిద్వారా ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని రగుల్కొల్పడంలోనూ, గ్రంథాలయ భాషా ఉద్యమాలను ప్రజా ఉద్యమాలకు జోడించి సాహిత్య వికాసాన్నీ స్వాతంత్ర్యపిపాసనూ ప్రజలలో పెంపొందించడంలోనూ మాడపాటివారు చేసినకృషి అద్వితీయం".

'ఆంధ్రభూమి' దినపత్రిక ఒక పెద్ద సంపాదకీయంలో "విలక్షణ భారతీయ సంస్కృతిని, అందులో అంతర్వాహిని అయిన ఆంధ్ర

సంస్కృతిని మేళవించి భాస్వంత జీవితాన్ని గడపిన సాత్త్వికమూర్తి మాడపాటి హనుమంతరావుగారు సఫల జీవనం గడిపారు. సంఘాన్ని ప్రాంతాన్ని జాగరితంచేసి, కలకాలం నిలిచే విజయాలను సాధించారు. తద్వారా దేశానికి అకలంక సేవచేశారు" అని వ్రాసింది. ఎందుకన్నారో సరిగా. తెలియదు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆంధ్ర పితామహులు కాలధర్మం చెందినప్పుడు పత్రికలవారితో మాట్లాడుతూ "ఏడు శతాబ్దాల అనంతరం తెలుగుజాతికి ఒకజ్యోతిని చూపించిన మహనీయుడు అస్తంగతుడైనాడు" అన్నారు.

హనుమంతరావు పంతులుగారి కృషిని సమీక్షించవలెనంటే-వారు ఆస్తిఏమీ లేకపోయినా, తమ జీవనోపాధికి పాటుపడుతూ నిజాంరాష్ట్రం లోని ప్రజలలో జాగ్రదవస్థను తెచ్చారు. ముఖ్యంగా నిద్రాణమైన తెలంగాణాను మేల్కొల్పి నూతన చైతన్యాన్ని ప్రసాదించారు. నిజాం రాష్ట్రి ఆంధ్రులలో ముఖ్యంగా మాతృభాషాభిమానాన్ని రేకెత్తించారు. మొదట గ్రంథాలయోద్యమాన్ని చేపట్టి తెలంగాణాలో గ్రంథాలయాలు, పఠనాలయాలు విరివిగా నెలకొల్పబడేట్టు చేశారు. ఆంధ్రోద్యమాన్ని భాషా ఉద్యమంగా తీర్చిదిద్ది తెలంగాణా చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించారు. నిజాం పరిపాలనలో ప్రజల ప్రాథమిక స్వత్వముల కొరకై దీక్షతో పోరాడారు. సాంఘిక సమస్యలను చేపట్టి సాంఘికోద్యమాన్ని ప్రవర్తింప జేశారు. సంఘసంస్కారానికి చేయూత నిచ్చి తెలంగాణా సమాజానికి అభ్యుదయ దృక్పథం కలిగించారు. స్త్రీ విద్యావ్యాప్తికి పాటు పడ్డారు. స్త్రీలలో చైతన్యం కలిగించి ఆంధ్రోద్యమంతో మహిళల ఉద్యమాన్ని ఐతపరచి, ప్రజాసేవలో స్త్రీలు ముందంజ వేసేట్టు చేశారు. వారిని ఆదరంతో, గౌరవంతోచూచి ప్రోత్సహించారు. యువకులలో ఉన్నతాశయాలను కలుగజేశారు. ప్రతిభా సామర్థ్యములుగల కార్యకర్తలను పైకి తెచ్చి, ఎందరో ప్రజాసేవకులను సృష్టించి, వారిచే నాయకత్వం నిర్వ

హింప జేశారు. తెలంగాణాకు నాయకత్వం కొరత లేకుండా ఎందరో ప్రజా సేవకులను సృష్టించి వారిని తీర్చిదిద్దారు. తెలుగు ప్రజలలో అన్ని కులసంఘాలకూ చేయూత ప్రోత్సాహము ఇచ్చి ఆయా కులాల వారు సాంఘికంగా పైకి రావడానికి తోడ్పడ్డారు. వీరి పరిశ్రమ, కృషి అన్ని కులముల, అన్ని వర్గముల పురోభివృద్ధికి కారణమైనది. వీరి ఆశీర్వాదము పొందని సంస్థ ఆనాటి హైదరాబాదులో లేదు. హైదరాబాదు వచ్చినవారికి 'ఆంధ్ర కుటీరం' దర్శించవలసిన పవిత్ర యాత్రా స్థలంగా ఉండేది. ప్రజా సేవకులకు మహోన్నతమైన ఆదర్శాలు ప్రసాదించారు. వీరు మితభాషి. కార్యవాది. కార్యసాధకులు. చేపట్టిన కార్యాన్ని అందరి సహకారంతో నిర్వహించడంలో దిట్ట అని నిరూపించుకున్నారు. ప్రజాసేవకై తమ జీవితం మొత్తాన్ని వినియోగించిన ధన్యజీవి. పలుకుబడి, అధికారం, గౌరవం, కీర్తిప్రతిష్ఠలు కాంక్షించక త్యాగశీలంతో, నిస్వార్థదృష్టితో, నియమబద్ధులై నిరంతరం ఆంధ్రాభ్యుదయానికై పాటుపడ్డారు. ఆంధ్రోద్యమమే వారి జీవితం.

నవ్యాంధ్ర నిర్మాతలలో మాడపాటి హనుమంతరావు పంతులుగారు తెలంగాణా వైతాళికుడుగా తేజోమూర్తియై చిరస్థాయిగా వెలుగొందుతూ ఉంటారు.

స మా ప్తం

# అనుబంధము 1

## మాడపాటి హనుమంతరావు పంతులుగారి షష్టిపూర్తి సందర్భంలో ఆహ్వానసంఘంవారు సమర్పించిన సన్మానపత్రము

మహోదయా ! కాకతీయ చక్రవర్తులు అవక్రమమైన పరాక్రమముతోను, అమోఘమయిన ఆజ్ఞాశక్తితోను, శత్రు నిరాకరణ ధర్మపాలనా పూర్వకముగా ప్రజాసేవ గావించి మించిన శతాబ్దములలో మింటబెట్టిన దీపమువలె మెరిసిపోయిన ఈ రాష్ట్రము నేటి కైదారు శతాబ్దముల నుండి ఆంధ్ర సభ్యతను "మఖ్యపెట్టి" మరచి అంధకార బంధురమైయున్నను ఆ "పార్థివ" తేజస్సు మరల మీ స్వరూపముతో నవతరించి ప్రశాంత ప్రగల్భమైన ప్రజ్ఞాశక్తిచే నిద్రాణ మయియున్న ప్రజానీకమునకు ప్రాణప్రబోధముల నొసంగి బ్రతుకుదెరువు చూపినది. ఈనాడు మీకృషి ఫలితముగా మన "తెలుగునాడు" మరల వెలుగునాడై నది. మీరు వెలిగించిన ఆంధ్రజ్యోతి అమరజ్యోతి యైనది. ఇట్టి మీకు భగవంతుడు చిరాయురున్నతిని ప్రసాదించుగాక !

నేతృ గుణాబ్ధీ ! కాపులేని మందవలె బెదరి చెదిరియున్న ఆంధ్ర సమాజమును కూడగట్టి ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములచే ప్రతికూల పరిస్థితులను తొలగించి క్రమశిక్షణా దక్షమయిన మార్గమున నడిపించుచు నాయక శిరోమణులై త్యాగశీలత్వము ప్రియవక్తృత్వము, ధీరత్వము, ఉచితజ్ఞతవంటి సహజగుణములను, నిరాడంబరత, సులభగమ్యతవంటి బాహ్యగుణములను ప్రదర్శించి ప్రజాసేవకులకు మహోన్నతములైన

ఆదర్శములను ప్రసాదించినారు. ఆంధ్రుల సంస్కృతి సభ్యతలు మరల వేళ్ళుపారి ఆకువేసి పుష్పించినవి. ఆంధ్రాభిమాన పరిమళములు అష్ట దిశలయందు వ్యాపించి ఆనంద వర్ధకములైనవి.

ఆంధ్రోద్యమ విధాతా ! ఈ ప్రసుప్తాంధ్రమును ప్రబుద్ధాంధ్ర ముగా చేయుటకు మీరు నిర్మించిన యుద్యమమే ఆంధ్రోద్యమముగా రూపొందినది. ఆంధ్రుల సర్వతోముఖాభ్యుదయమే ఆంధ్రోద్యమమునకు పూర్ణస్వరూపము. మొదట గ్రంథాలయోద్యమమును చేపట్టి రాష్ట్రము నందంతటను గ్రంథాలయములను, పఠనాలయములను విరివిగా నెల కొల్పి ఆంధ్రోద్యమమును భాషోద్యమముగా తీర్చి తెలంగాణపు చరిత్రలో నూతనాధ్యాయమును కలిగించినారు. మీ యుద్యమ ప్రచారమునకు శ్రోతృవర్గమును సిద్ధపరచుకొని క్రమక్రమముగా ఆంధ్రుల సాంఘిక సమస్యలను పైకితెచ్చి వాటికి పరిష్కరణ మార్గము చూపుచు సంఘ సంస్కారమునకు పునాదులువైచి దానిని సాంఘికోద్యమముగా ప్రవ ర్తింపజేసి ప్రజాహృదయములను చూరగొని, ఉద్యమమును మరింత పుష్టివంతము గావించినారు. నిజాము ప్రభుత్వముతో ప్రజల ప్రాథమిక స్వత్వములకొరకై ప్రశాంత దీక్షతో పోరాడ సంకల్పించి ఆంధ్ర మహా సభను స్థాపించి నిరంతరముగా కృషి గావించి, ఆంధ్రోద్యమమునకు రాజకీయత్వరంజన మొసగి రాష్ట్రీయాంధ్రుల కెంతయు నున్నతిని సమకూర్చి పెట్టినారు. అవకాశము గల్పించుకొని స్త్రీ విద్యాప్రచారము నకు సంఘమున సగపాలైన సోదరీమణులలో చైతన్యము పోసి వారి ద్వారా కృషిని నిర్వహింప జేయుచు ఆంధ్రోద్యమమును మహిళోద్య మముతో జతపరచి సర్వాంగ సుందరము గావించినారు. నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తులో ముఖ్యభూమికను ధరించి దానిని రాజ కీయములతో నెట్టి సంబంధములేకుండ దూరముగనుంచి ప్రజాసభ్యతను పోషించు నుద్దేశ్యముతో దానికి స్థయిర్య మొసగి ఆంధ్రోద్యమమును

వైజ్ఞానికోద్యమముగా దీర్చి ఆంధ్రజాతీయతకు సర్వాంగపుష్టిని చేకూర్చి నారు. ఇట్టి ఆంధ్రోద్యమపితామహులైన మీరు చిరాయురారోగ్యములతో వర్థిల్లి ఇంకను మాకు మార్గదర్శకు లయ్యెదరుగాక.

కార్యకుశలా ! చేపట్టిన కార్యమును నిర్వహించుటలో మీరు వైచిన మార్గములు ఎల్లరకును అనుకరణీయములు. అభ్యుదయోపాయ ములు. ఆంధ్రోద్యమమును ఎల్లప్పటికిని ఏకనాయకముగా చేయక వెనుక నుండి ఉద్యమమునకు సూత్రధారులై ప్రతిభా సామర్థ్యములుగల కార్యకర్తలను ఏరి పైకిదెచ్చి వారిద్వారా నాయకత్వము నిర్వహింపజేసి ఇప్పటి కెందరినో ప్రజా సేవకులను సృష్టిచేయుట యందలి మీ నిర్మాణ శక్తి ప్రపంచమునకు ఆదర్శప్రాయము కాగలదు. మీరు ప్రత్యక్షము గాను, పరోక్షముగాను ఆంధ్రసంఘమందలి యెల్ల కుల సంఘములకును తోడుపడి మీ యుత్సాహ శీలము వారికి పంచియిచ్చి ఆయా సంఘములు చైతన్యవంతములై అభివృద్ధినందగా చూచి ఆనందవైశాల్యమును పొంద గలవారు మన రాష్ట్రమున మీరొకరే యనిన సాహసము కాగూడదు. మీతో ఏదో ఒక సంబంధములేని ప్రజాసంస్థ మన హైదాబాదులో లేదనినప్పుడు మీకృషిక్షేత్రమెంత సువిశాలమైనదో తెలియగలదు. మీ రాంధ్రోద్యమమును నిర్వహించిన తర్వాతనే రాష్ట్రీయులగు మహారాష్ట్ర కర్ణాటకులలో తదీయోద్యమములు ప్రారంభింపబడుటయు తత్సంస్థల యందు కూడ మీకు గౌరవస్థాన ముండుటయు చూడ మీ కార్య కుశల త్వము ఎంత నిగూఢ గంభీరమైనదో స్పష్టమగుచున్నది.

సహృదయవతంసా ! మీలో నిర్వ్యాజమయిన సహృదయత్వమే తలపెట్టిన కార్యముల విజయరహస్యమని సూక్ష్మదర్శకులకు గోచరింప గలదు. అదియే మాకిప్పటికిని ధ్యేయమగుచున్నది. తెలంగాణమున

కింత విశాలోన్నత గంభీరమయిన అభ్యుదయ కృషి గావించిన మీకు రాష్ట్రీయు లేమిచేసి మీ ఋణమును తీర్చగలరు? కారణజన్ములైన మీ జన్మదినము తమకు జాతీయోత్సవ దినముగా చేసికొని ప్రాచీన సాంప్రదాయ సిద్ధమయిన షష్టిపూర్తి రూపముతో మీకు వజ్రోత్సవమును గావించి తమకు కృతజ్ఞతను ప్రకటింప గోరుచున్నాము. మీరు భౌతికముగా వ్యక్తిరూపముతో మా నడుమ నున్నను, మహావ్యక్తులగుటచే ఆంధ్ర ప్రజాభ్యుదయ రూపముగా పరిణతి పొందుటయే ఈ ఉత్సవమునకు హేతువు. ఈ సందర్భమున "పత్రం పుష్పం ఫలం తోయ" మన్నట్లు మా హృదయపుష్ప క్షేమఫల ఆనందబాష్ప తోయం పురస్సరముగా ఈ సన్మానపత్రమును సమర్పించుకొని కృతకృత్యు లయ్యెద మని విన్నవించుచున్నాము".

# అనుబంధము 2

## హనుమంతరావు పంతులుగారి షష్టిపూర్తి సందర్భంలో లక్ష్మణరాయ పరిశోధకమండలి పక్షాన సమర్పింపబడిన సన్మానపత్రం

జయ విజయీభవ – దిగ్విజయీభవ

శ్రీ స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర ఆసఫ్ జాహి వంశాభరణ శ్రీమన్మహబూబ్ ఆలీఖాన్ బహద్దరు పాదుషా కుమారతిలక ! లెఫ్టినంటు కర్నల్ ఫత్తేజంగు జి. సి. యస్. ఐ. జి. సి. బి. రాయల్ విక్టోరియా రత్నహారాలంకార! సార్వభౌమ ప్రభుత్వ పరమహితావతంస! సుల్తానుల్ ఉలూం శ్రీమదల్లా భక్తిభావరంజిత చిత్తసరోరుహ! శ్రీనిజాం ప్రాజ్య రాజ్యలక్ష్మీ నిజేశ్వర ! సుభట సంస్తుత్య నామాది ప్రశస్తి సహితులగు హెచ్. ఇ. హెచ్. నవాబు సర్ మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ బహద్దరువారు హైదరాబాదు మొదలి పట్టణంబుగా సుఖసంకథావినోదంబుల పృథ్వీరాజ్యంబు చేయుచుండగా,

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౮౬౭ అగు నేటి పార్థివనామ సంవత్సర మాఘశుద్ధ పంచమీ బుధవారము నాండు భాగ్యనగర నామాంతర హైద్రాబాదు పురవరంబున సకలాంధ్ర జనులు, సకలజాతీయులు ఆబాలగోపాలము కవి పండిత గాయక విద్వజ్జనులు పరివేష్టించి శ్రీ మన్మాడపాటి హనుమంతరాయామాత్య నాయకమణి షష్టిపూర్తి మహోత్సవ శుభసందర్భమున పేరోలగంబునం దుండగా.

ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు

సకల విద్యావినోద! శాంతి ప్రియ వినయవిభూషణ ప్రజ్ఞా యుగంధర ఆంధ్రపితామహ మాడపాటి వంశ పయఃపారావారరాకా సుధాకర వెంకటప్పయామాత్య తనూభవ వేంకటసుబ్బమాంబా గర్భ శుక్తి ముక్తాఫల హనుమంతరాయామాత్యులకు శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి సభాసదులు ఆనంద కందళిత హృదయారవిందులయి సమర్పించుకొన్న అభినందన పత్రము ఏమనగా—

ఆంధ్రతిలకా! భవదీయ సంకల్ప సందేశ సమాలోచన భాగ్యము పొంది శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి తెలంగాణపు చరిత్ర మాగాణమునందు కృషి సలిపినది. తమ ప్రతిభా విశేషమున తాళపత్ర గ్రంథములు గౌరవ పాత్రములయి విశిష్టతనుపొందినవి. శిలాశాసనములు ముక్తకంఠముతో ప్రాచీనాంధ్ర ప్రాభవమును జాటినవి. ఆంధ్ర చరిత్రకు నూతన వికాసము కలిగినది.

ఆంధ్రమాన్యా! భవదీయ కార్యనిరతి యోచనాబలము సహస్ర భానుమండల మరీచీ వీచికలతో వేయిదిక్కుల ప్రసరించి తెలుంగు రాష్ట్రము నెట్లు సంచలితముజేసి ప్రాచీనాంధ్ర చరిత్రాభిమానమును ఎట్లు ప్రజ్వలితము చేసెనో అట్టి చరిత్రాత్మక విషయమును శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి సభాసదులు కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచున్నారు.

ఆంధ్రరత్నా! భవదీయ షష్టిపూర్తి మహోత్సవ మంగళ సందర్భమునందు శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి సభాసదులు ప్రేమాంజలులను తమకు సమర్పించుకొనుచున్నారు.

వేదోక్తం పరిపూర్ణమాయురస్తు
సమస్త సన్మంగళాని భవంతు.

# అనుబంధము 3

## ఆంధ్రపితామహ
## మాడపాటి హనుమంతరావు గారికి
## సమర్పించిన సన్మాన పత్రము

ప్రియమయిన మహాభాగా,

హైదరాబాదు నగరమునకు శాసనబద్ధమగు "కార్పరేషన్" పద గౌరవము లభించుట ఈ రాష్ట్ర చరిత్రలో నూతనాధ్యాయము. ఈ నూతనాధ్యాయమున ప్రప్రథమ "హైదరాబాదు మేయరు" పదవీవిరాజ మానులుగా తమరు వరణీయులయినందులకు మాకెంతో సంతోషము కలిగినది. వివిధ మతానుయాయులగు మా "నగరపితలు" తమరిని ఏకగ్రీవముగా నెన్నుకొనుటలో జూపిన విచక్షణా శీలము ఎంతయు సంస్తుతి పాత్రమయి యున్నది. తమరు జనవంద్యులును జనప్రియు లును అనుట కీ యెన్నికయే ప్రబల తార్కాణము.

ఆంధ్ర నాయకాగ్రేసరు లగు తమకు "నగర పౌరావతంస" గౌరవము లభించుట భాగ్యనగరాంధ్ర జనుల గౌరవమును ఇనుమడింప జేసినది. వయోవృద్ధులయి, శాంతికాములయి యింట నుండిన తమరు నగర పరిపాలనా భారమును వహించుట తమ స్వార్థ త్యాగమునకు మరియొక నిదర్శనముగా నున్నది. తమరు అర్థ శతాబ్ద కాలము పలు విధ రంగములందు దేశసేవా నిమగ్నులై ప్రకాశించి యున్నారు. ఈ దీర్ఘకాల కార్యక్రమమునందు మీకు బాసటగా నుండిన సత్యసంధత్వము,

శాంతిప్రియత్వము, సౌజన్యశీలము, కార్యదక్షత, సహృదయత యీ నూతన కార్యరంగమున తమకు సంపూర్ణ జయమును కలిగించునని మేము విశ్వసించు చున్నాము.

హైదరాబాదు నగరము భారతదేశములో నాల్గవదిగను, ఆంధ్ర దేశములో మొదటిదిగను గణనకెక్కి యున్నది. అట్టి ఆంధ్ర నగర మునకు ఆంధ్ర పితామహులు ఆధిపత్యము వహించుట బంగారమునకు తావి యబ్బినట్లయినది. మీ సత్పరిపాలనమున హైదరాబాదు నగరము మేలిబంతియై ఆరోగ్యానందములకు నిలయమై, శాంతి సౌఖ్యముల కాలవాలమయి, విద్యా వివేకములకు తావలమయి, మేటినగరమయి భాసిల్లు గాక !

తాము చేసిన ఘనకార్య పరంపరలో ఈ బాలికల ఉన్నత పాఠశాల మహోన్నత మయినది. ఈ పాఠశాల తమ యనుంగు బిడ్డ. ఈ ముద్దు బిడ్డను లాలించి, సాకి, విలాసవతిగా తీర్చి దిద్దిన యశో విశాలురు తమరు. ఈ విధముగా మాకత్యంత ప్రియులును పూజ్యు లును అయిన తమరు "మేయరు" పదవి నలంకరించుట మాకు అత్యా నంద సంధాయకమయినది. ఈ బాలికల ఉన్నత పాఠశాల పక్షమున ఈ సంతోష సమయమున మా హృదయ పూర్వకాభినందనములను సమర్పించుకొను చున్నాము. మా ప్రేమ గౌరవముల సూచకముగా మేము సమర్పించుకొను నీ అల్ప పారితోషికమును దయతో స్వీక రించుడు. తమకు ఆయురారోగ్య భాగ్యములను పరమేశ్వరుడనుగ్ర హించుగాక !

విధేయులు,
రాజా బహద్దరు వేంకట్రామారెడ్డి, ఒ. బి. ఇ. (అధ్యక్షుడు)
పాలక వర్గము, ఉపాధ్యాయ వర్గము.
బాలిక ఉన్నత పాఠశాల, నారాయణగూడ, హైదరాబాదు.

# అనుబంధము 4

## ఆంధ్రపితామహ, పద్మభూషణ,

## డాక్టరు మాడపాటి హనుమంతరావు పంతులు గారికి

## వి న యాం జ లి

తెలంగాణాలో మీరు నాటిన ఆంధ్రోద్యమ బీజము ప్రవర్ధమానమై శాఖోప శాఖలుగా విస్తరిల్లి ఫలించింది. తెలంగాణపు ప్రజలు మీ పిలుపును విని మేల్కొన్నారు. మీరు చూపించిన వెలుగుజాడల నడచారు, గమ్యస్థానాన్ని క్షేమంగా చేరుకొన్నారు. మీ ఉపకృతిని సదా స్మరించు కొంటున్నారు.

తెలంగాణపు ప్రజానీకము ప్రేమతో ఆంధ్ర పితామహులని మిమ్ము పిలుచుకొన్నారు. నాటికి నేడు యావదాంధ్రావనికి పెద్ద సభకు అధ్యక్షులుకాగా, ఆ పేరు సార్థకమైంది. రాజధానీ నగరపు తొలి మేయరుగాను, ఆంధ్ర ప్రదేశ్ పెద్దల సభ ప్రథమాధ్యక్షులుగాను, మీకు జరిగిన సన్మానము తెలంగాణము తన సన్మానంగా భావిస్తున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయము మీకిచ్చిన డాక్టరేట్ పట్టము ప్రజా స్వామ్యమునకు గుర్తింపుగా భావిస్తున్నాము.

సూర్యాపేట మీ బాల్యక్రీడలకు మీ ప్రేమను చూరగొన్నది. మీ పిలుపు నందుకొని అభ్యుదయ రంగంలో ముందుకురికి మీ మెప్పును సంపాదించింది. సూర్యాపేటకు మీకు గల సంబంధము అవినాభావమైంది.

సూర్యాపేటకు ఆదిసంస్థ ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథ నిలయము—జ్ఞాన తేజస్సును విరజిమ్ముటయేగాక ప్రజాస్వామ్య శంఖా రావాన్ని ఎలుగెత్తి చేసి ప్రతీప శక్తులను భయభ్రాంతులను జేసింది. దేశారాధనకు సహజమైన లేమిని అనుభవిస్తున్నది. ఎన్నాళ్లకో చిన్న ఇంటిని కట్టుకొని ఈనాడు గృహప్రవేశాన్ని జరుపుకొంటున్నది ఈ శుభ సమయంలో పితృదేవులయిన మీకు వినమ్ర పూర్వకంగా నమ స్సుల నర్పిస్తున్నది. కలకాలం ప్రజలను సేవించి జ్ఞానదానాన్ని ఇతోధి కంగా చేయగల శక్తి కలుగవలెనని ఆశీర్వదించమని అర్థిస్తున్నది.

ఇట్లు

ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయ కార్యనిర్వాహక వర్గము

సూర్యాపేట

# అనుబంధం 5

## శ్రీ గౌతమీ గ్రంథాలయము, రాజమహేంద్రవరము వారు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు 'ఆంధ్రపితామహ' 'పద్మభూషణ్' శ్రీ మాడపాటి హనుమంతరావు గారికి సమర్పించు

## స్వాగత పత్రము

ఆంధ్రపితామహా ! పావన గౌతమీ స్రవంతి ప్రాంగణమున యున్న చరిత్రాత్మక పట్టణమైన రాజమహేంద్రవరములో అమూల్య ప్రాచీన గ్రంథములతో అలరారుచు, దేశవ్యాప్త ప్రశస్తిగల ఈ పురతన గ్రంథాలయము తరపున మిమ్ములను ఆహ్వానించు భాగ్యము కలిగినందులకు మేమెంతయు ఆనందించు చున్నాము.

గ్రంథాలయోద్యమ పితామహా !! ఈ గ్రంథాలయము 1898వ సంవత్సరములో స్థాపింపబడి కందుకూరి వీరేశలింగం పంతులు, వడ్డాది సుబ్బారాయుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం— 'కవిసార్వభౌమ' శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ఆదిగా గల మహా పండితుల ఆదరాభిమానములతోను; 'మధురకవి' శ్రీ నాళము కృష్ణారావు, కంచుమర్తి సీతారామచంద్రరావు, బోడపాటి సత్యనారాయణ, అడివికొలను లక్ష్మీనారాయణ, శ్రీ అడివి శంకరరావు మొదలగు గ్రంథాలయోద్యమ సేవకుల అవిరామ కృషి ఫలితముగను, ఈనాడు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, హిందీ మొదలగు వివిధ భాషలలో సుమారు 60,000 గ్రంథములతో అన్ని తరగతుల ప్రజలకు అందుబాటులో యున్నది.

సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ సంవిధాతా !!! తాము తెలంగాణమున నిజాం ప్రభుత్వ కాలమున విజ్ఞానవ్యాప్తికై గ్రామ గ్రామముల గ్రంథాలయముల స్థాపించియు, తెలుగు భాషా వ్యాప్తికై బాల బాలికల పాఠశాలల నెలకొల్పియు, సాహిత్య రంగంలో గ్రంథముల ద్వారా తమస్వీయ రచనలేగాక అనేక అమూల్య గ్రంథముల ప్రచురించియు సాంస్కృతిక పునరుజ్జీవనమునకు సర్వతోముఖముగ ఒనర్చిన సేవను ఆంధ్రదేశము ఎన్నటికిని మరువజాలదు. భాషోద్ధారకులగు మిమ్ములను ఆహ్వానించు భాగ్యము కలిగి నందులకు గర్వించుచున్నాము.

సౌజన్యమూర్తీ !!!! ఈ గౌతమీ గ్రంథాలయము అమూల్య గ్రంథ సంపన్నమైనను, ఆర్థికముగ అనేక ఇబ్బందులకు లోనగుచున్నదని తెలుప చింతించుచున్నాము. మన రాష్ట్ర ప్రభుత్వము ఇటీవల చేసిన పౌర గ్రంథాలయ శాసనము వలన ఇట్టి ప్రాచీన ప్రజా గ్రంథాలయములకు ఎట్టి సహాయము లభింపజాలని పరిస్థితి ఏర్పడినది. గ్రంథాలయ నిర్వహణలో అనుభవనీయులగు తమకు నిర్వహణలో గల సాధక బాధకములు సువిదితములేగదా ! గావున తమవంటి గ్రంథాలయోద్యమాభిమానుల సహాయముతో ప్రభుత్వమునుండి ఆర్థిక సహాయమును పొందు అవకాశమును కలుగజేయ గోరుచున్నాము.

మీరు దయతో ఈ గ్రంథాలయమునకు విచ్చేసినందులకు మా కృతజ్ఞత.

ఇట్లు

శ్రీ గౌతమీ గ్రంథాలయ అధ్యక్షులు, పాలకవర్గ సభ్యులు,

రాజమహేంద్రవరము

30 నవంబరు, 1960.

# అనుబంధం 6

## ఉస్మానియా విశ్వవిద్యాలయం
## మాడపాటి హనుమంతరావు పంతులుగారికి
## డాక్టర్ ఆఫ్ లిటరేచర్ గౌరవ పట్టా
## ప్రదానం చేసిన సందర్భంగా
## విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు
## డా॥ ఎస్. భగవంతంగారు చేసిన ప్రశంస

**CITATION**

On the occasion of the Convocation of the Osmania University held on 4–11–1956, Dr. S. Bhagavantham, Vice Chancelloɹ of the Osmania University read the following citation :

*"Mr. Chancellor,*

I have the honour to present to you, for the conferment of the Degree of Doctor of Literature, Honoris Casusa, Shri Madapati Hanumantha Rao

Shri Madapati Hanumantha Rao, born in 1885, is popularly known as Andhra Pitamaha. Even in his student days, when he was at Hanumkonda, Shri Hanumantha Rao was attracted to the literary and social reform movements. In those days, political restrictions of a decaying bureaucracy were so numerous and tight that even such venues were all closed. Astute observer as he was, he could see that creating love for one's own literature and advancing the library movement were the

only channels left to him to work through for attaining the ideal of self-government The Telugu Library at Hanumkonda and later on the Sri Krishna Deva Raya Library at Hyderabad were practically his creations. Shri Hanumantha Rao used these institutions to expand his early activities and these institutions used him as a pillar of strength around which to grow.

Gradually he widened the field of his beneficial activity and started work to obtain freedom for the people of Hyderabad as a whole. Many were the institutions which he brought into being and nurtured. On the political side, the Nizam Rashtra Andhra Maha Sabha was the pinnacle of his activities. On the educational side, the Raja Bahadur Venkata Rama Reddy Women's College has a great future and will be a standing monument of his patient and laborious work. For nearly five decades, Shri Hanumantha Rao has been the guide, friend and philosopher to the people of Hyderabad, be they Telugus, Maharashtrians or Kannadigas.

Shri Hanumantha Rao, the man of letters, is also a well known figure. He is a very able and persuasive speaker both in Telugu and Urdu. He writes with great ease and clarity of thought in both these languages. In the history of Telugu literature, he is counted as one of the originators of the short story. Several newspapers of Hyderabad owe much to him. The Telugu pathrika, Nilagiri, Golkonda, Sujatha-were all adorned by his writings.

He was elected to the Mayoralty of Hyderabad for three consecutive terms between 1950-1953. On January 26, 1955, the President of India conferred on him the title of "Padma Bhushan" in recognition of his long and meritorious services. He is a life member of

our Senate appointed as such by the Chancellor in recognition of the eminent services rendered by him to education and has been a member of the University Council for some years now. Uncorruptability in public life is the banner of his political career and selflessness is his motto.

Thus, Mr. Chancellor, I have, in presenting Shri Madapati Hanumantha Rao, the honour of presenting the grand old man of Hyderabad who has always been en example to us of plain living and high thinking and who at all times gave everything to others and got nothing from them for himself. I pray now that at this Convocation assembled, the Degree of Doctor of Literature; Honoris Casusa, be conferred on Shri Madapati Hanumantha Rao."

4-11-1956.

'ANDHRA PITAMAHA MADAPATI HANUMANTHA RAO,'
a biography in Telugu, By D. Ramalingam



రచయిత

**డి. రామలింగం :** ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రులు. హైస్కూలు విద్యార్థిగా ఉండగానే క్విట్ ఇండియా ఉద్యమంచే ఆకర్షితులై జాతీయోద్యమాన్ని వ్యాప్తం చేయడంలో కృషిచేశారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని, స్టేట్ కాంగ్రెసు తెలుగు వార పత్రిక "సారథి"కి సహ సంపాదకులుగా పనిచేశారు. "గోలకొండ దిన పత్రిక" సహాయ సంపాదకులుగా కొంతకాలం పనిచేశారు. ఆ తర్వాత ప్రభుత్వోద్యోగం - ఆంధ్రాంగ్ల సాహిత్యాల అధ్యయనం, ముఖ్యంగా కథా సాహిత్యం, నవలా సాహిత్యం గూర్చి పరిశీలనం జరుపడం వీరికి అభిమాన విషయాలు గ్రంథ సమీక్షకులుగా పాఠకులకు సుపరిచితులు. బాలలకు భారత స్వాతంత్ర్యోద్యమ కథ ("స్వరాజ్యం నా జన్మ హక్కు"), రవీంద్రుని జీవిత చరిత్ర ("విశ్వకవి") రచించారు.

---

Cover Printed at Nandini